# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 4 | రాజమహేంద్రవరము 16-5-1981 | సంచిక 14


—* ఈ సంచికలో *—


1) ధూర్జటి కవితా మాధుర్యము.

2) కుట్టికవి - మహిషశతకము.

3) కవిత్వం - ఒక అందమైన అబద్ధం.

4) వసంతం. [పద్య]

5) చదువు - తపస్సు.

6) అద్దేపల్లి 'మినీకవిత'

7) ఋతువిలాసము. [పద్య]

8) తెనాలికవులు - సాహిత్య సేద్యం.

9) వనిత. [పద్య]

10) పురాణములు - భక్తి.

11) గ్రంధసమాలోచన

ఎ. శ్రీరామకథా సామ్రాజ్యము.

బి. Lives of Ancient Indian Saints

సి. సాయితత్వం.

12) కాలము! [పద్య]

13) వసంతం ఉదయించాలి.

14) ఈపక్షంలో.

15) భారతి. [సంపా]


1—6—81 సంచికలో నాచన సోముని నవీనగుణము, అత్యద్భుత శతావధానులు, నాటకరంగంలో విశ్వనాథ వైశిష్ట్యం కావ్యాలంకార సంగ్రహము - సమాజ దర్పణము మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 16-5-1981 | సంచిక 14

# ధూర్జటి కవితా మాధుర్యము

- శ్రీ ఎ. క్రిష్ణప్ప, ఎం.ఏ., బి.ఎస్‌సి.

శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానము నలంకరించిన అష్టదిగ్గజ కవులలో ధూర్జటి మహాకవి యొకడు. ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము అనునవి రచించి శ్రీకాళహస్తీశ్వరునకే అంకితము గావించి తన శివభక్తిని చాటుకొనెను. నన్నయ తరువాత వెలసిన శివ కవులు ఈశ్వరునిపై శతకములు, రగడలు, కావ్యములు, నమస్కార గద్యలు, వ్రాసి; శివునకే అంకితము గావించిరి. అట్లే ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యములో రగడ, నమస్కారగద్య (దండకము) వ్రాసి శ్రీకాళహస్తీశ్వర మకుటముతో నొక శతకమును వ్రాసి శివునకే అంకితము గావించెను. శ్రీ కాళహస్తీశ్వర శతకము ధూర్జటి విరచితము కాదని కొందరందురు. ఇది సరికాదు. ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యములో పద్యాంతములు శతకలక్షణాలను బోలియుండుటను బట్టి, తిన్నడు శివునిగూర్చి ప్రస్తుతించునప్పుడు 'లింగమా' అను మకుటముతో మూడు పద్యము లుండుటను బట్టి ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకరచనానంతరమే శ్రీకాళహస్తి మాహాత్మ్యమును రచించి యుండవచ్చును.

రాయల కాలములో వెలువడిన క్షేత్ర మాహాత్మ్యములు 2. ఒకటి పాండురంగ మాహాత్మ్యము. రెండవది శ్రీకాళహస్తి మాహాత్మ్యము. శ్రీకృష్ణ దేవరాయలు సభలో ధూర్జటి కావ్యములోని కవితా మాధుర్యమును గూర్చి 'స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గెనో, యతులిత మాధురీ మహిమ' అని ప్రశంసించినట్లు కుమారధూర్జటి తన కృష్ణరాయ విజయములో పేర్కొనెను. శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును చదువునప్పుడు పై రాయల ప్రశంస అతిశయోక్తి కాదనిపించును. శ్రీకాళహస్తి మాహాత్మ్యములో ధూర్జటి చూపిన భక్తి తత్పరత, ఆధ్యాత్మికత, లోకజ్ఞత, రసపోషణలోని రామణీయకత, వర్ణనా వైశిష్ట్యము ధూర్జటి కవితా మాధుర్యమునకు ముఖ్య కారణములు

శ్రీ కాళహస్తీశ్వర శతకములో ధూర్జటి

'జలకంబుల్ రసముల్ ప్రసూనములు వా
  చాబంధముల్ వాద్యముల్
కల శబ్దధ్వను లంచితాంబర మలం
  కారంబు, దీప్తుల్ మెఱుం
గులు నైవేద్యము మాధురీ మహిమగా
  గొల్తున్ నిన్నున్ భక్తిరం
జిల దివ్యార్చనగూర్చి నేర్చిన క్రియన్
  శ్రీకాళహస్తీశ్వరా' (50)

అనెను. రసములు, వాచాబంధములు, శబ్దధ్వనులు, అలంకారములు జోడించి భక్తి రంజిల్లునట్లు మాధురి మహిమగా కొల్తుననెను. ఇదే భావమును మార్చి శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో ధూర్జటి 'నీశివభక్తి కావ్యసరణింగడు ధన్యత బొంద నవ్యభాషా శతధా నిగుంభన రసస్థితి నొప్ప దలిర్ప జెప్పుమీ' అని శివుడే ధూర్జటిని అడిగినట్లు వ్రాసికొనెను.

ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో వసిష్ఠుడు, అగస్త్యుడు, బ్రహ్మ, చెలది, పాము, ఏనుగు, తిన్నడు, నత్కీరుడు, శివబ్రాహ్మణుడు, ఇరువురు వేశ్యలు, యాదవరాజు-వీరికి సంబంధించిన కథలను వివరించెను. కథలు విడివిడిగా నుండి కథా సంవిధానము సరిగా జరుగలేదను సందేహము కలుగును. కాని ధూర్జటి కావ్యారంభములో గ్రంథారంభమున 'ప్రధాన స్థానంబైన మహాపురం బెట్టిదనిన' అని చెప్పి శ్రీకాళహస్తి వర్ణనము గావించెను. భక్తులందరు శ్రీకాళహస్తి చేరి శివుని దర్శించియే కైవల్యమును బొందిరి. ఇట్లు తలంచినచో కథైక్యము జరిగిన దని చెప్పవచ్చును. వీరు వారను భేదము లేక భక్తి గల వారందరు పరమేశ్వరానుగ్రహమునకు పాత్రులని యిందు నిరూపించెను. ధూర్జటి బ్రహ్మద్వారా తత్త్వ

జ్ఞానమును, తిన్నడు తిర్యక్కుల ద్వారా మూఢభక్తిని, నత్కీరుని ద్వారా కవితా శక్తిని వేశ్యలద్వారమున శివమాహాత్మ్యమును వెల్లడి చేసెను.

ధూర్జటి గొప్ప శివభక్తుడు శ్రీ కాళహస్తీశ్వర శతకములో ధూర్జటి శివుని రూపును గూర్చి యిట్లడిగెను. 'నిన్ను మనస్సులో ఏ రూపముగ భజింతును? నీ రూపు మోకాలో? స్త్రీయో? చన్నో? కుంచమో? మేక పెంటికయో.' ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యములో వేది వర్ణించిన శివభక్తిపరముగా వర్ణించుట యొకవిశేషము. వేశ్యాకన్యలు బాల్యము తొలగి యౌవనదశ చేరుకొన్నారు దీనిని ధూర్జటి శివభక్తి పెరుగుచున్నట్లు క్రింది పద్యములో హృద్యముగ వర్ణించెను

'శివపూజనాసక్తిఁ జిన్నిచన్నుల పెక్కు
వయిచిఁ బ్రత్యేకంబును నయముజూప
శైవాగమాంతర జ్ఞానంబుఁ దనులతా
ప్రభయు నంతంతకు నభిమతముగ
బార్వతీ ప్రాణేశ భక్తియుఁ గూకట్లు
వెలసి నానాటికి వృద్ధిఁబొంద
వార కులాచార వాసనా బాల్యంబు
లొకపూట కొకపూట కడిగి పోవ
శాంభవంబైన తేజంబు శైశవాప
గమవయో గణ్యలావణ్య గౌరవంబు
హృదయమున నంగకంబుల నుదయ
మొదవ
జదువబోవుదు రిరువురు మదవతులును'
(4-23)

ఇట్లే తిన్నని బాల్యచేష్టలు శివలీలలుగా గర్భవతియైన తిన్నని తల్లి శోభను శివుని లాసములుగా, తిన్నడు పుట్టినప్పుడు శివభక్తి లక్షణ సమన్వయముగా, చంద్రోదయ వర్ణనమును శివలింగదర్శనముగా వర్ణించి ధూర్జటి శివునిమీదగల అపారమైన భక్తిని, తన ఆధ్యాత్మిక భావమును జాటుకొనెను.

ధూర్జటి అద్వైత భావమును గూర్చి యీ క్రింది విధముగ బ్రహ్మచే జెప్పించెను.

'స్వానుభవంబునఁ దథ్యము
గానబడుంగాని, మీ యఖండాద్వైత
జ్ఞానము శాస్త్రకృతి, బహు భా
షానైపుణి గలియ నదియశక్యమట! శివా!
(శ్రీ. కాళ 1-80)

స్వానుభవముతో యథార్థ స్వరూపము కనపడును గాని, అద్వైత జ్ఞానము బహు భాషా నైపుణ్యమున తెలియదని స్పష్టము చేసెను.

ధూర్జటి శివభక్తికి ప్రతీక తిన్నని మూఢభక్తి కావచ్చును. శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో వదశి భక్తికన్న తిన్ననిభక్తి మిన్న. తిన్నని భక్తిని రమణీయముగా, మధురముగా చూపెట్టెను. తిన్నడు పూర్వ జన్మమున అర్జునుడు. వీరత్వమును జూచి. మెచ్చి. పరమేశ్వరుడు ప్రత్యక్షమై పాశుపతాస్త్రము ప్రసాదించి; 'కలియుగమున తిన్నడుగా జన్మించి, భక్తి భజియించి సర్వేశ్వరానుగ్రహమును బొందెదవనెను. ఆవిధముగా శివానుగ్రహమును జన్మించిన తిన్నడు పెంగి పెద్దవాడయ్యెను ఒకనాడు పరిజనముతో వేటకు వెడలిన తిన్నడు అడవిలో వేటాడి, శ్రమించి, డస్సి, చెట్టు నీడను నిద్రింప, కలలో శివుడు కనపడి మొగలేటి దరిలో శివుడున్నాడని తెల్పి పూజింపు మనెను తిన్నడు శివలింగమును అడవిలో గాంచి యిక్కడెందు కున్నావని అడిగి, ఆహారమును, బంధువులను, ఆడవారిని చూపించెద నని ఆశచూపి తన యూరు రమ్మనెను శివుడు వెంట రానందుకు పరిజనముకు నాయం జుట్టము తల్లిదండ్రులు జెలుల్నాథుండు నీదైవమే అని చెప్పి పంపివైచి తిన్నడు అడవిలో స్వామి సన్నిధిలో నుండి పోయెను. తిన్నడు కటకట్లు తిను మని యెంత వేడుకొన్నా శివుడు తిననందు కీవిధముగ విలపించెను.

'నీ వారగింప కుండిన
జీవన మేమిటికి నాకు? శివ! నీపద రా
జీవముల మీద బ్రాణము
లేవిడుతు; నటంచు వ్రాలి యేడ్వం
దొడగెన్' (3-91)

ఈశ్వరుని కంటిలో రక్తము కారుటను గాంచిన తిన్నడు వైద్యము చేసెను. మందులు 'వెల్లి గలిసిన చింతపండు, నీట గ్రాసిన వ్రాలు' నైనవి. 'కంటి కింక గంటి కంటె మందు గలదె' ముక్కంటికి ని తన కన్ను పెరికి శివునికి పెట్టెను. రెండవ కన్ను అట్లేకాగా తిన్నడు తన రెండవ కన్ను కూడ పెకలింపబోవ శివుడు ప్రత్యక్షమై తిన్ననికి కైవల్యమును ప్రసాదించెను. ఈ విధముగ ధూర్జటి తిన్ననిభక్తి నొక్కొక్క మెట్టే ఎక్కించి పరమపద సోపానములో కూర్చుండ బెట్టెను. శ్రీకాళహస్తి మాహాత్మ్యములో నీఘట్టము రసవత్తరమై భక్తిప్రధానమై యొప్పారు చున్నది

ధూర్జటి తన కవితా ప్రతిభను నత్కీరుని పాత్ర ద్వారమున వెల్లడిచేసెను. నత్కీరుడు శివుని చేత చెప్పి పంపబడిన శివబ్రాహ్మణుని పద్యమున తప్పు పట్టెను. 'లోకము నగదే! పూనుకొని సహజగంధము వేనలికిం గల దటన్న వేయు నాలుకలన్' అని వాదించెను. శివుడే నత్కీరునితో వాదమున దిగినప్పు డిట్లనెను.

'తలచుట్టు వాలు గన్నులు
గలిగిన, పద్యంబు తప్పు గాదన వశమే?
వల దిచ్చట నీ మాయా
విలసనములు; పనికిరావు; విడువు,
మటన్నన్' (3-171)

ధూర్జటి కెరువు పద్యాలు గాని, తప్పులు గాని నచ్చవని పై పద్యము వలన గ్రహింపవచ్చును.

ధూర్జటి భక్తి భావనలో పోతనను, వర్ణన సందర్భములలో శ్రీనాథుని తలపింప జేయును. ధూర్జటి భావనా కౌశలమున కీ క్రింది పద్యము పట్టుకొమ్మ.

'ఆత్మలోనున్న పుత్రహత్యా కళంక
మాతృజా భావతా దోష, మాతృరూప
యైన పిండంబు గర్భస్థమైన, బైట
వెడలె నన, జన్ను మొనలందు బొడమె
నలుపు' (3-81)

బ్రహ్మ భార్య గర్భవతియైనది. అప్పుడు తనలోనున్న పుత్ర హత్యా కళంకము, పుత్రహీనతా దోషము తన రూపమైన పిండము నుండి బయటికి వచ్చెనో యన్నట్లు చను మొనలందు నలుపు కలిగె నట. అట్లే సూర్యాస్తమయ వర్ణనము గావించునపుడు సూర్యుని తూర్పు దిక్కను స్త్రీ విసరిన బంతిగా, విష్ణువు వేసిన చక్రముగా, దిన మహీరుహము నుండి పడిన పెద్దపండుగా, దేవదానవ యుద్ధము నుండి జారిన రథచక్రముగా, వర్ణించి ధూర్జటి వర్ణనా వైశిష్ట్యములో మేటి యనిపించు కొనెను.

ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యములో నెక్కడను తనను గూర్చి కాని, తన కావ్యమును గూర్చి గాని తెలుపలేదు. కాని ధూర్జటి బ్రహ్మకథలో మాత్రం ఆత్మ సంబంధ విషయాలు కొన్ని పరోక్షముగ చెప్పు కొన్నా డనిపించును. బ్రహ్మ శివునితో పలుకుచున్న ఈ మాటలు సాక్షాత్తు ధూర్జటియే శివునితో ననుచున్నట్లున్నవి.

'దేవ! నీవంటి దేవుడు, దివ్యతీర్థ
రాజములలోన దక్షిణ రజత శిఖరి
వంటి క్షేత్రంబు, నావంటి వాంఛితార్థ
సిద్ధుడు, నరుదు ధర విమర్శించి చూడ'
(2-76)

అట్లే బుభువు జననమును ఈ విధముగ జెప్పెను.

'వాఙ్మయంబైన వేదాంత వారియందు
నర్థమయుడైన చిద్విధుం డవతరింప'

ఇక్కడ ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యమును వాఙ్మయ మను వేదాంత సముద్రమునుండి వెలువడిన అర్థమయమైన చంద్రుని వంటిదని తెల్పినట్లున్నది. వెలువడిన వేదాంత కావ్యాలలో నిది లోకమునకు చంద్రుని వంటి దని ఈతని భావమై యుండవచ్చును.

ఈ విధముగ ధూర్జటి కావ్యము భక్తి ప్రధానమై, మధుర భావ సంయుతమై యొప్పారుచున్నది.

# కుట్టికవి - మహిష శతకము

- అభినవకాళిదాస శ్రీ తెల్కపల్లి రామచంద్రశాస్త్రి

జయన్తి తే సుకృతినో రస
రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తి తేషాం యశః కాయే
జరామరణజం భయమ్॥

అని చెప్పినాడు భర్తృహరి. అంటే జన్మాంతర సుకృత విశేష వాసన గల వారే కవిశ్రేష్ఠులై రససిద్ధు లగుదురు. అట్టికవి వరేణ్యుల కీర్తి శరీరములకు ఇతరుల శరీరముల కున్నట్లు ముదిమి వలన గాని మృతివలన గాని భయ ముండదు. ఇట్టి కవులు రససిద్ధులైన మహర్షులవలె కీర్తి శరీరముతో ప్రపంచమున శాశ్వతముగా నుందురు అని తాత్పర్యము.

పూర్వపు సంస్కృత మహాకవులలో కుట్టికవి యొకడు. ఈకవికి 'వాంఛేశ్వరుడు' అనునామాంతరము కూడ కలదు. ఇదియే తండ్రిగారిచే పెట్టబడిన పేరు. ఈకవి నివాసము శహాజీరాజపురాగ్రహారము. దీనికి తిరువిశనల్లూరు అనునామాంతరము గలదు. ఈయూరు కుంభకోణమునకు రెండుమైళ్ళ దూరములో కావేరీనది యొడ్డున నున్నది. ఈ కవి కనడజాతి బ్రాహ్మణుడు. కావేరీతీరమున శివకేశవక్షేత్ర విరాజమానమై బహుపండిత ప్రకాండుల కాలవాలమైన శ్రీ తంజానగరమును భోసలవంశ సంభవులైన మహారాష్ట్రప్రభువులు పరిపాలించుచున్నపుడు ఆరాజులకు ఈ కవి వంశీయులు వంశపరంపరగా మహాపండితులై మంత్రులుగా నుండిరట. ఈకవియు వేదవేదాంగ పారంగతుడు. ఈ యన భోసల రాజవంశములోని ఏకోజీ మహారాజు పాలనలో మంత్రిగను, ఆస్థాన విద్వాంసుడుగను నుండి మంచిసమయము దొరికి నపుడెల్ల నామహారాజునకు నీతి మార్గము నుపదేశించుచుండెను. ఈ యంశమంతయు ఈ కవిచే రచింపబడిన మహిషశతకమునకు వ్యాఖ్యాతయు, ఈ కవికి పౌత్రుడు నగు వాంఛేశ్వరుడు వ్రాసిన మహిషశతక వ్యాఖ్యానమునకు మొదట వ్రాయబడిన-

'శ్రీమత్కావేరజాతీరం
విద్వద్బృన్దోపశోభితమ్।
అత్యుత్తమ శివక్షేత్రం
విష్ణ్వాదిస్థాన మస్తి హి.
తత్ర తంజపురంనామ
రాజాస్థాన మనుత్తమమ్।
రాజానః ప్రథితా స్తత్ర
భోసలీ యాన్వవాయజాః॥
తదమాత్యకులోత్పన్న
శ్శ్రీమాన్వాంఛేశ్వర స్సుధీః
శిష్టః కనడజాతీయో
వేదవేదాంగ పారగః
నీతిమార్గేణ రాజానం
తత్తత్కాలే వ్యచోదయత్'

అను శ్లోకమువలన దెలియుచున్నది.

ఈకవితండ్రి మహావిద్వాంసుడై క్రీశ. 1691 లో తంజానగర రాజ్యము నువహించియున్న శహాజీ మహారాజునకు మంత్రిగా నుండెను. శహాజీ మహారాజు కూడ విద్వద్వతంసుడు, విద్వత్ప్రియుడు నగుటచే దేశదేశములనుండి వేదవేదాఙ్గ పారఙ్గతులైన పండితులను పిలిపించి,

వారి విద్వత్తును పరిశీలించి నలువది మంది మహాపండితుల నెన్నుకొని వారికి 'తిరువిశనల్లూరు' అను గ్రామమును సర్వాగ్రహారముగా నిచ్చియున్నాడు. ఈ గ్రామము శహాజీ మహారాజుచే నివ్వబడినందున నీ గ్రామమునకు 'శహాజీపురాగ్రహారము' అని నామాంతరము వచ్చినది. క్రీ.శ 1948 వరకు హూణప్రభుత్వము కూడా రాజశాసన ప్రకారము అగ్రహారము పండితవశముగా పరిపాలించినది.

విద్వత్ప్రియుడును, తంజానగర పాలకుడునైన శహాజీ మహారాజు ఒకపుడు మధుర మీనాక్షీ సందర్శన కుతూహలియై సపరివారముగా మధురానగరము వెళ్ళెనట. అపుడు శహాజీ రాజుదగ్గర మంత్రిగానున్న తన తండ్రివెంట వాంఛేశ్వరుడు కూడా మధురకు వెళ్ళినాడట. శ్రీ శహాజీ మహారాజు శ్రీ మీనాక్షిని సందర్శించిన తోడనే-

'పురమధురం గిరి మధురం
గరమధురంధరనితంబ భారాఢ్యమ్
స్థూలకుచం నీలకచం
బాలకచంద్రాంకితం తేజః'

అని తన ఆశుకవితతో మీనాక్షిని నుతించెనట. అపుడు తన తండ్రిని వెంబడించి రాజసన్నిహితుడైన వాంఛేశ్వరుడు శహాజీ మహారాజుగారి కవితను విని వెంటనే తానును ఆశువుగా-

'హృది తరసా విదితరసా
తదితర సాహిత్యవాఞ్ఛా మే గలతి।
కవిలోకేన విలోకే
భువిలోకేశస్య శాహజీ రుపమామ్॥'

అని మహారాజును ఆశువుగా పొగడెనట. అపుడు మహారాజు పదునారేండ్ల వయసువాడైన వాంఛేశ్వరుని వంక చూచి అతని కవితానైపుణ్యమునకు మెచ్చి వాంఛేశ్వరునకు 'కుట్టికవి' అను బిరుదము నొసంగెను. కుట్టి శబ్దమునకు ద్రావిడభాషలో 'బాలుడు' అని అర్థము. 'కుట్టికవి' యనగా 'బాలకవి' అని అర్థము. అది మొదలు లీ వాంఛేశ్వరుడు 'కుట్టికవి' అను బిరుదనామముచేతనే ప్రసిద్ధుడయ్యెను. ఈ కవి వంశీయు లందరికిని 'కుట్టి' అను నామము రూఢమయ్యె. ఈయంశము కుట్టికవి మనుమడు, కుట్టికవి విరచిత మహిషశతకమునకు వ్యాఖ్యానము రచించిన వాడునగు వాంఛేశ్వర పండితుడు స్వరచిత మహిషశతక వ్యాఖ్యానాన్తమున -

"ప్రీయతాం కుట్టికృతినా
నిర్మితేయం సుధీముదే।
భూయాద్వాంఛేశ్వర గ్రంథ
వ్యాఖ్యాశ్లేషార్థ చన్ద్రికా॥

"ఇతి శ్రీ కుట్టిసూరి కృత మహిష శతక వ్యాఖ్యా సంపూర్ణా" అను పద్యగద్యముల వల్ల తెలియుచున్నది. పై శ్లోకములలోని 'వాంఛేశ్వర గ్రంథ వ్యాఖ్యాశ్లేషార్థచన్ద్రికా' అను వాక్యము వలన ఈకవి మహిష శతకము శ్లేషభూయిష్ఠమైన దనియు ఈ కవికి 'శ్లేషకవి చక్రవర్తి' అను బిరుదము కూడా కలదనియు తెలియుచున్నది

ఈ కవి మహిషశతకము, ధాటీ శతకము, ఆశీర్వాదశతకము, అను మూడు శతకములు వ్రాసియున్నాడు. ప్రకృత మహిష శతకము చిరకాలముగా ప్రచురితమై పాఠకలోకమున ప్రసిద్ధమయ్యె. ధాటీ శతకము ప్రచురింపబడలేదు. గనుక నద్దాని విషయమైయేమియు చెప్పుటకు వీలులేదు. మూడవదియైన ఆశీర్వాదశతకమునకు జగద్గురు శ్రీకాఞ్చీ కామకోటి పీఠాధీశులు శ్రీకుప్పా ఆంజనేయశాస్త్రి గారిచే 'సుధాసార' మను వ్యాఖ్యానము వ్రాయించి 1971లో నచ్చొత్తించి ప్రచురించి యున్నారు. ఈ శతకములో కవి స్రగ్ధరావృత్తావలంబముతో బ్రహ్మ, సరస్వతి, విష్ణు దశావతారములను శివ, అంబ, లక్ష్మి మున్నగు భగవన్మూర్తులను, బాణచండాది భక్తులను, కైలాసాది శైలములను, నవగ్రహములను, గంగాదినదులను, వశిష్ఠాదిమునులను, కాశీకాఞ్చి సేత్వాది క్షేత్రములను, రామాయణాది దివ్యగ్రంథములను ఆయా దేవతలు మున్నగు వానియొక్క విశిష్టమహిమ విశదమగు నట్లుల స్తుతించినాడు. తరచుగా నింకలి శ్లోకములన్నియు పురాణగాథా సంబద్ధములై యలరారు చున్నవి.

ఈకవి పైమూడు శతకములు రచించినట్లు మరియు ఈయన శ్లేషకవి సార్వభౌముడైనట్లును ఈక్రింద నుదాహరింపబడిన -

"చక్రే మాహిష శతకం
ధాటీశతకం తథాశిషాం శతకమ్।
శ్లేషకవి సార్వభౌమః
శ్రీమాన్వాంఛేశ్వర స్స్వతంత్రోసౌ॥'

అను శ్లోకమువలన విశదముగ దెలియుచున్నది. ఈకవి శ్లేషచక్రవర్తి బిరుద యాథార్థ్యము కవికృత మహిష శతకములోని ద్వ్యర్థి పద్యములు తెలుపుచున్నవి.

ఇదిగాక భోసల వంశీయుడైన అమరసింహుడను ప్రభువు దేవతా సేవాసక్తుడై మధ్యార్జున క్షేత్రమున నివసించి యున్న సమయమున నొక వంగదేశపు పండితుడు ఇక్కడికి వచ్చి ఈ దేశములో తత్త్వచింతామణి పద్ధతిని శాస్త్రార్థము చేయు పండితులెవరును లేరని ఘంటా ఘోషముగా ప్రచారము చేయుచుండగా నీ వాంఛేశ్వర కవియు నవద్వీప పండితుడైన శ్రీనివాసాచార్యులవద్ద తర్క శాస్త్రము నామూలాగ్రముగా చదివినవాడు, మహాప్రతిభాశాలియు నగుటచే పైవంగీయు పండిత ప్రచారమును సహించక అతనితో శాస్త్రార్థమును సాగించి, అతని పూర్వపక్షమును ఖండించి తిరుగ తానొక పూర్వ పక్షము చేయగా నాపండితుడు ఇందులకు సమాధానము చెప్పలేకపోయినాడట. అపుడు ఆనరసింహ ప్రభువు, ఆనాటికి పదహారు సంవత్సరముల వయసు గల ఈకుట్టికవి అనన్య సామాన్య శాస్త్ర సామర్థ్యమునకు అబ్బురపడి ఇతడు తత్త్వచింతామణి శాస్త్రార్థములో విజయము

నొంది యున్నందున ఈకవికి 'మణికట్టి' 'చింతామణికట్టి' అను బిరుదములనిచ్చె నని ప్రతీతి గలదు కనుకనే వాంఛేశ్వరుడు తాను వ్రాసిన గ్రంథములకు తన బిరుదనామమును సంఘటించి, భాట్ట చింతామణి, శ్రాద్ధ చింతామణి, దత్త చింతామణి, అద్వైత చింతామణి అని పేర్లు పెట్టియున్నాడని తెలియుచున్నది మరియు క్రీ. శ. 1800 లో భోసల వంశీయుడైన రెండవ శరభోజీ మహారాజు తంజానగర రాజ్యమును పాలించుచు ఓరత్తనాడను గ్రామములో వేదశాస్త్ర పాఠశాలను స్థాపించి అందు కొంత మంది మహాపండితులను ఉపాధ్యాయులనుగా నియమించె నట కట్టి కవి అందు ప్రధానాధ్యాపకుడుగా నియమింపబడె నట. ఇట్లుండగా కొంత కాలమునకు మహారాజునకు, తనకును ఏదియో యొక చిన్న విషయములో మనోవైషమ్యము గలుగుటచే కట్టి కవి స్వతంత్రుడైన తాను పరాధీనుడై యుండుట కిష్టపడక వెంటనే తీర్థయాత్రా వ్యాజమున రాజాజ్ఞ నొంది బయలుదేరి ఉత్తర దేశాభిముఖుడై పూనానగరము జేరి అచటి పీష్వా బాజీరాయల ఆస్థానము నలంకరించెను ఆప్రభువు కట్టికవి పాండిత్యాతిశయమునకు ఆశ్చర్యపడి పలు విధముల బహూకరించి హిరణ్యకేశీయ శ్రౌతసూత్రములకు భాష్యమును వ్రాయ నర్థించె నట ఈమహాపండితుడైన కట్టి కవి రాజ ప్రార్థన నంగీకరించి పై శ్రౌత సూత్రములకు భాష్యమును వ్రాసి అచటి నుండి కాశీనగరము జేరి అక్కడ నహోబిల పండితులకడ వేదాంతశాస్త్రమును జదివి, అనేకులైన శిష్యులకు పాఠములు చెప్పి సుప్రసిద్ధుడయ్యె తరువాత అక్కడినుండి బైలుదేరి స్వదేశాభిముఖుడయ్యెనట పైయంశములలో గొన్ని అంశములు ఈ కవి మనిమనుమడైన వాంఛేశ్వరకవి ఈకవి రచించిన మహిష శతకమును వ్యాఖ్యానించుచు గ్రంథారంభమున వ్రాసిన -

'వందే డుంఢిం మహాలింగం
విశ్వేశం మణికర్ణికమ్।
ఈశ్వర శ్రీనివాసార్యౌ
హోబిలాఖ్యగురూత్తమాన్'

అను పద్యములవలన నవుమితములగుచున్నవి కట్టికవి మహారాష్ట్ర దేశము మీదుగా స్వదేశాభిముఖుడై వచ్చుచు మార్గమధ్యమున ధార్వారా, చించిలీ, పూనాామున్నగు సంస్థానములను సందర్శించి అక్కడి ప్రభువులకు తన పాండిత్యమును ప్రదర్శించి వారిచే సత్కరింపబడి క్రీ శ 1818 తర్వాత మైసూరు సంస్థానము చేరి విద్యాప్రియులైన శ్రీ కృష్ణరాజ వడయారు ప్రభువులచే సమ్మానింపబడి వారి ప్రార్థనచే నచట ధర్మాధికార పదము నలంకరించెనట. మరియు తానక్కడనున్న సమయముననే శ్రీ శృంగేరీ జగద్గురు సంస్థానమునకు వెళ్ళి పూర్వము తనకు శిష్యులై యుండి ఆ సమయమునకు శృంగేరీ పీఠాధిపులైన యున్న నృసింహ భారతీ స్వాములచే గుర్తింపబడి, వారిచే ననేక విధములుగా సత్కరింపబడె నట. తర్వాత అక్కడినుండి బయలుదేరి తిరిగి మైసూరు చేరి మహారాజ సహాయముతో నక్కడ వాజపేయ యాగముచేసి మహారాజువలన ఛత్రచామరాది రాజలాంఛనముల నొంది రాజానుమతిచే స్వగ్రామము జేరెనట అపుడు విద్వాంసుడైన తంజానగర ప్రభువు శరభోజీ మహారాజు కవి రాక తెలిసి సగౌరవముగా తన ఆస్థానమునకు పిలిపించి తన తప్పులు మన్నించుటకై ప్రార్థించి శ్రీవాంఛేశ్వరకవి సఫలాశీస్సులనొంది ఈ మహా పండితుని యుపదేశానుసారము రాజ్యమును పాలించెనట. ఈ యంశములన్నియు ఈకట్టికవి రచించిన గ్రంథములకు ప్రామాణికులైన కొందరు పండితులు వ్రాసిన పీఠికలవలను వారి పరిచయ వచనములవల్లను తెలియుచున్నది.

ఇదిట్లుండగా ఈ కట్టికవి తన పవిత్రమైన వార్ధక్యమునకు గ్రామీణ జంతువులలో హేయముగా గణింపబడిన దున్నపోతును గురిచేసి ఈ ప్రకృత మహిష శతకమును వ్రాయుటకేమి హేతువో ఇంచుక విచారింతము.

కట్టికవి ఏకోజీ మహారాజునకు మంత్రిగానుండి క్రీ శ.18వశతాబ్ది సమయములో హితము నుపదేశించుచు రాజును ధర్మపాలకునిగా చేయుచుండె నట. ఇట్లుండగా దైవ వశమున సేకోజీ మహారాజు పరమ పదించుటయు తర్వాత ఆయన కుమారుడైన ప్రతాప సింహుడు రాజ్య పాలనా పీఠము నధిష్ఠించుటయు తటస్థించినది. ఆసమయములో ప్రతాప సింహుడు బాలుడైయుండి రాజ్యపాలనా విధానము తెలియంగక దుష్టులను తన దగ్గర జేర్చుకొని వారి కధికారముల నిచ్చి సత్ప్రవర్తన గలిగి పండితులై యుండిన అధికారులను పదవులనుండి తొలగించి, వంశక్రమాగతములైన రాజ సంప్రదాయములను విస్మరించి, దుర్మార్గులైన అధికారుల తోడనే పాలనము సాగించి, యున్నాడట సుబేదారుడు మున్నగు అధికారులు గ్రామములపై బడి, చెలరేగి ప్రజల కష్టసుఖ సమయములను లెక్కింపక వారినుండి అక్రమములైన పన్నులను, ప్రజలుపండించిన ధాన్యములో భాగములను బలాత్కారముగా వసూలు చేయుచు దొంగలవలె నిలువు దోపిడీ చేయసాగిరట ఈ దుష్పరిపాలనలో బాధలు భరింపలేక ధీమంతులైన విద్వాంసులు, మానవంతులగు ప్రజ లెల్లరును ఆదేశమును విడచి వెళ్ళిరి. కొందరమాయక ప్రజ లట్లే పడి యుండిరి కట్టికవి ప్రతాపసింహునకు మంత్రియై

యున్నను ఈ దుర్మార్గులలో చిక్కుకొనిన రాజును ఒకప్పుడైన సందర్శించుటకు, హితము నుపదేశించుటకు అవకాశము లభించని వాడై, బాలిశుడైన రాజును సత్ప్రవర్తకుని గా చేయుట కనేక ప్రయత్నములు చేసి చూచెనట తన ప్రయత్నములు సఫలములుకా వని తలంచి, ప్రజల కష్టములను, సత్పురుషుల దుస్థితిని చూడలేక పలు విధముల పరితపించుచు, రాజును దుష్ప్రవర్తననుండి తప్పించుటకొకటే మార్గమని నిర్ణయించి ఈ మహిపశతకమును ప్రచారము చేయించి, రాజును చెడ్డనడక నుండి మరలించి సత్ప్రవర్తనతో రాజ్యమును పాలించు నటుల జేసెనట ఇదియే ఈ శతకరచనకు హేతువు. జీవనము గల తన సుకవితతో లోకము యొక్క చిత్తవృత్తిని తారుమారు నొందించు వాడే కవి అట్టికవియే కావ్య ప్రపంచములో బ్రహ్మ కనుకనే ఆగ్నేయ పురాణములో -

'అపారే కావ్య సంసారే
కవి రేవ ప్రజా పతిః ।
యథా వై రోచతే విశ్వం
తథైత త్పరి వర్తతే ॥
శృంగారీ చేత్కవిః కావ్యే
జాతం రసమయం జగత్ ।
స చేత్కవి ర్వీతరాగో
నీరసం వ్యక్త మేవ తత్ '

అని చెప్పి యున్నాడు అనగా అంతులేని కావ్య సంసారమును సృష్టించు కవియే బ్రహ్మ. ఈకవి బ్రహ్మ అభిరుచి ననుసరించియే ప్రపంచము మార్పునొందుచుండును. కవి యభిరుచి రసహీనమైన, జగత్తు రసహీన మగును' అని అర్థము. ఇది ఈ పట్టి కవి చరిత్రము.

( సశేషం )

# కవిత్వం - ఒక అందమైన అబద్ధం

- శ్రీ నసామాస స్వామి, ఎం. ఏ.

లాక్షణికుల్లో పలువురు కవితా జగత్తు వాస్తవిక జగత్తు కన్నా కొంత భిన్నమైందని ఉద్ఘాటించారు. కవిత్వం వాస్తవలోకానికి ప్రతిబింబం కాదు మానవప్రకృతి చమత్కారమయం ఆవేశబద్ధం, కావున ఆవేశబద్ధములు, చమత్కారసిద్ధములును, అయిన విచిత్ర ప్రవృత్తులకు ప్రాతినిధ్యం వహించే మానవ ప్రకృతి ప్రతిబింబమే కవిత్వం.

గణానాం త్వా గణపతి హవామహే
కవిం కవీనా ముపమశ్ర వస్తమం

సాక్షాత్పరబ్రహ్మ మని దీని తాత్పర్యం. బ్రహ్మ తన దివ్యశక్తి చేత జగత్తును సృష్టించినట్లే కవీశ్వరుడు తన కవితాశక్తి చేత కావ్య ప్రపంచాన్ని సృష్టిస్తాడు. కాని

"నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం'

అనే శ్లోకాన్ననుసరించి బ్రహ్మ సృష్టిలో నుండే నియతధర్మం కవి సృష్టిలో లేదని విదితమౌతుంది. బ్రహ్మ సృష్టి సుఖదుఃఖాత్మక మైతే కవి సృష్టి కేవలం సుఖాత్మక మౌతుంది. కావ్య ప్రపంచానికి కవియే సృష్టికర్త అతడెలా తలుస్తాడో లోకాన్నలా మలుస్తాడు. కవీశ్వరుని కల్పన బహుముఖమైంది. బహుచిత్రమైంది.

'భావా న చేతనా నపి చేతనవ
చ్చేతనా నచేతనవత్
వ్యవహారయతి యథేష్టం
సుకవిః కావ్యే స్వతంత్ర తయా'

అనే శ్లోకాన్ననుసరించి తిమ్మిని బ్రహ్మిని, బ్రహ్మిని తిమ్మిని చేయడంలో వడిదిరిగిన చేయి కవి దని వెల్లడౌతూంది. సత్యదూరమైందాన్ని వాస్తవానికి దగ్గరగా నుండేట్లుగా చిత్రించడమే గాక కవి తన దివ్య కవితాశక్తి చేత భూతల స్వర్గం చేస్తాడు ఎట్టి ఘట్టమైనను చివరకు ఆనందదాయకం కావడమే కావ్య జగత్తులోని నియత ధర్మం

వాస్తవికత అనేది ఎప్పుడూ చెల్లేది కాదు కొన్ని తావులందు వాస్తవికత లేని చిత్రణం సిగ్గును తీరుస్తుంది వాస్తవ జగత్తులో సర్పాలు మాణిక్యాలను తలను దాల్చినట్లుగా కన్పించనే కన్పించవు కాని అవే కావ్యజగత్తులోకి ప్రవేశిస్తే మాణిక్య భూషితాలై కనిపిస్తాయి లక్ష్మణకవి తెనిగించిన 'భర్తృహరి సుభాషితం' లో 'చారుమాణిక్య భూషిత శస్త మస్తకం బయిన పన్నగము' అని 'మల్ల భూపాలీయంలో 'ఫణమణి కోజ్వలం బయ్యె నయ్యహి' అని, 'లక్ష్మీ శారదా సుభాషిత లో' 'భీకర విషధారి యైన భుజగంబు మణిన్ తలదాల్చి నంత' అని సర్పాల శిరస్సులమీద మణులున్నట్లుగా వర్ణించారు. నీతి శతకంలో 'మకర ముఖాంతరస్థ మగు మానికమున్' అని మొసలి నోటిలో కోరల నడుమ ముత్య మున్నట్లుగా కవి వర్ణించాడు 'మొసలి నోటిలో ముత్యం మృగ్యమే' కేవలం ఇది కవిచాతుర్యం. కవు లిలా కావ్య ప్రపంచంలో వాస్తవాని కతీతంగా సృష్టించే ప్రయత్నానికి నిదర్శనం అలోకింగా వారు చిత్రించిన ఊహా చిత్రణలే

యధార్థంగా జరిగే దొకటైతే కవి మరియొక తీరుగా దానిని తన దివ్యకవితా శక్తిచేత చమత్కారంగా వర్ణిస్తాడు

'కరవాల ధారల గాననగు కుంభికుంభమౌక్తికంబులున్' (ద్రో- 1-377) అని భారతంలో 'ముక్తాఫలైర్వీర కృపాణ శేఖా, విభిన్నగన్ధద్విపకుమ్భముక్తైః' అని మధురా విజయంలోను ముత్యాలు మదగజకుంభస్థలంలో నున్నట్లుగా వర్ణించుతారు వాస్తవంగా వర్ణింపవలసింది యుద్ధంలో కుంభికుంభస్థలాన్ని విదలిస్తే నెత్తురు చిమ్ముట కాని వర్ణితమైంది రాలిపడిన ముత్యాలు

కవులు అలౌకికంగా ఊహించిన విషయాలు సైతం కేవలం అనుభూతులు కావు వీటి పునాది లౌకికానుభూతుల్లోనే వుంది మణులు ముత్యాలు సామాజిక జగత్తులో వున్నవే లౌకిక జగత్తులోని భావనయే కావ్యజగత్తులోని మణులు ముత్యాలు. లౌకిక జగత్తులో కవులు పొందిన లౌకికానుభూతులే కొంచెం భేదంతో అలౌకిక వస్తువులుగా రూపొందినాయి కవిత్వం వాస్తవలోకానికి ప్రతిబింబమైనట్లయితే లౌకిక మణులు, ముత్యాల వంటి విషయాలకు కవితాజగత్తులో తావు లేదు.

ప్రతిభావంతుడైన కవి ప్రకృతిని చమత్కారంగా వర్ణిస్తాడు. ప్రకృతిని కవి పెంపుచేకూర్చి సొగసుగా చిత్రిస్తాడు కుమార సంభవంలో లతను లలితాంగిగా కవి చిత్రించాడు తర్వాతి కవులు ప్రకృతి వర్ణనలో మావి మాధవీలతలను ప్రేయసీ ప్రియులనుగాను, సోదరీసోదరులనుగాను వర్ణించారు మేఘసందేశంలో 'అత్రైవాస్తి కనక తాళవనం' అని ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో 'అస్మత్ ఘనాత్ కనక తాళగనైక దేశం' అని బంగారు తాలవనం వర్ణించబడింది. 'లోకాలోక ఇవాచలః' అని కాళిదాసు కల్పించిన ఈ చక్రవాళ పర్వతానికి సామాజిక జగత్తులో బీజప్రాయమేమీ కానరాదు ప్రకృతి లేనిది కవి భావింపలేడనుట వాస్తవమే అయినా కవి లేనిది ప్రకృతియొక్క యాంతర్యమే శూన్యం. ఇట్టి సామాన్య వస్తువులే కవి ప్రతిభచే విలక్షణంగా విశిష్టంగా, లోకోత్తరంగా గోచరిస్తాయి.

వస్తుస్థితి భావాన్ని పురస్కరించుకొని చిత్రితమౌతూ ఉంటుంది కాని కేవలం ఆవస్తువు యథార్థ స్వరూపాన్ని బట్టికాదు. ఒక్కొక్కసారి కవి యథార్థానికి అతీతంగా భావన చేస్తాడు కొన్ని సందర్భాలలో వస్తువు యధార్థ స్వరూపం గుప్తమై ఒక క్రొత్తరూపం దానిలో మెరుస్తుంది అదే మానసికావస్థను బట్టి భిన్న సందర్భాలలో భిన్న అనుభూతులను ఇస్తుంది వాస్తవ జగత్తున దొరకని వస్తువులను కవితా జగత్తులో సృష్టించుకొని అవ్యక్తానందం పొందుతాడు. ఉదా - పుష్పక విమానం మీది ప్రయాణానుభూతి, మేఘదూత్యంలో ప్రణయానుభూతి, (రామాయణంలో రావణుడు) ప్రేవులనే వీణాతంత్రిగా చేసుకొని నినదించిన రాగానుభూతులు మచ్చునకు పేర్కొనవచ్చును అంతేగాక కవీశ్వరుడు స్వర్గంలోనిదివ్యస్వరూపాలను తన దివ్యకవితాశక్తిచేత కావ్యప్రపంచలో వెల్లడిస్తాడు లోకంలో కవిచే భావ్యమానమై రస భావాన్ని కలిగింపనిది లేదన వచ్చును

'బురదలోన బ్రతికే కుమ్మరి పురుగులను లేవనెత్తి బంభరాలుగా మార్చే బ్రహ్మత్వం కవితలో ఉంది గచ్చపొదలు జిల్లేడులు, పల్లేరులు కవి కలం సోకితేనే కల్పవృక్షాలవుతాయి కనులకు గారడీ చేసే కమనీయాకృతి కల్పించడం కవికి మాత్రమే సాధ్యం' అన్న డాక్టర్ సి. నారాయణరెడ్డి గారితో మనం ఏకీభవించక తప్పదు.

# వసంతం

శ్రీ సత్యవోలు వేంకటేశ్వరరావు,
బి. టెక్.

* వచ్చింది వచ్చింది
వసంతమే వచ్చింది
కోయిల కూత కూసింది
ఉగాదినే తెచ్చింది. ||వచ్చింది||

* ఎటుచూచినా సతత హరితమ్ములే
జగమంతా అనురాగ భావమ్ములే
ప్రతి యెదలో నవమోహ రాగమ్ములే
యింతకన్నా కోరేది ఏముందిలే ||

* మధుమాసపు ఊహాలతో
మందారపు సొగసులతో
మరుమల్లెల సోయగాలతో
జగమంతా శోభిల్లే నూత్న కాంతితో||

— —

---

విద్వాంసులు కొందరు కవితా జగత్తే సత్యమని వాస్తవ జగత్తు మిథ్యయని కావ్యజగత్తునుండే సామాజిక జగత్తు రూపుదిద్దు కొంటోందని అభిప్రాయపడ్డారు. (సామాజిక జగత్తునుండే కావ్య జగత్తు పుట్టిందనుట ఉచితం) కావ్యజగత్తు తన అపూర్వ రామణీయకతతో మానవుని అనుభూతులను మార్చవచ్చును

సాధారణ ప్రకృతి కతీతమైంది కవిత్వం అనేక విలక్షణ సృష్టి కల్పనయే కవి కర్తవ్యం కవిత్వం భ్రాంతి నుండి ఉద్భూతమయ్యేది కాన సత్యదూరమయినను కవితాజగత్తు వాస్తవ జగత్తు కన్నా సుందరమైంది అందుకే మన మేధావులు కవుల కల్పన అనలేక కవిత్వం - ఒక అందమైన అబద్ధం' అని అంటారు.

# చదువు - తపస్సు

- శ్రీ మానేపల్లి సత్యనారాయణ, ఎం.ఏ.

చదువు -
తడుముకుంటున్న నా మనసులో
తలుపు తెరిచింది
అంతకు ముందువరకూ
స్పష్టంగా తెలీని చీకటిపై
స్పష్టమయిన విజ్ఞానకాంతి వెదజల్లింది
చదువు - నాలో అంత
ౖచైతన్య నేత్రం తెరిచింది
అందుకే - చదు
వొక తపస్సని తెలుసుకున్నాను.

చదువు -
నాకు అనన్యసాధ్యమైన
దివ్యదృష్టి ప్రసాదించింది
నన్ను త్రికాల జీవిగా
త్రికాలవేదిగా చేసింది
దూరదూరాల్లో కాలతీరాల్లో
వెలసిన చరిత్రని కళ్ళకు కట్టింది
భూతకాలంలోకి చూస్తూ
భవిష్యత్తు నూహించే
దార్శనికతనూ యిచ్చింది.
చదువు సర్వశక్తివంతమైనది
అందుకే - చదు
వొక తపస్సుగా ఉపాసించాను.

చదువు -
నాజీవితంలో సర్వసృష్టిని మేల్కొల్పింది
నా ప్రకృతిలో విశ్వప్రకృతిని
ప్రతిష్ఠించింది
నాలోని నన్ను నాకు
సాక్షాత్కరింప జేసింది.
అమేయమైన తురీయావస్థనూ
సాక్షాత్కరింప జేసింది
అందుకే - చదు
వొక వరంగా స్వీకరించాను.

చదువు -
నాలో నా కెవరూ లేరని
నిరాశ పొగల సెగలు కమ్మినప్పుడు
నా బ్రతుక్కి అర్థం లేదని
అలమటించినప్పుడు
నేనున్నా నున్నా నని బుజంతట్టింది.
గుండెల్లో హాయి చిలికింది.

ఏ దేవతలూ త్రాగివుండని
అమృతం పట్టించింది
జన్మదాతగా నెచ్చెలిగా
పథనిర్దేశిగా నన్ను సాకింది
చదువు నాకు పాథేయం ఆరాధనీయం.
అందుకే - చదు వొక తపస్సని
గాఢంగా నమ్ముతున్నాను
ఆ తపస్సులో అనవరతం మునిగి
తేలుతూ కాలాన్ని జయిస్తున్నాను.

(శ్రీకాకుళంజిల్లా సాంస్కృతికశాఖ ఆధ్వర్యవంలో జరిగిన కవి సమ్మేళనంలో చదివి సన్మానించబడిన కవిత)

# అద్దేపల్లి 'మినీకవిత'

- శ్రీ టి. శ్రీరంగస్వామి

సామాజిక చైతన్యపు ప్రాణంతో, వచనగేయపు ఊపిరితో జీవనం సాగిస్తూ, భౌతికవాద, మానవతావాద పూర్వక మైన సాంఘిక విప్లవం కోసం తపనతో అన్వేషణ సాగిస్తూ మనలో అంతర్ జ్వాలను సృష్టించిన అద్దేపల్లి రామ మోహన్ రావుగారు ఒక సమగ్రమైన సమ్యక్ దృష్టితో 'మినీకవిత' ను సమీక్షించి మన ముందుంచినారు

సాహిత్య రంగములో ఇప్పుడిప్పుడే ఒక నూతన సంచలనాన్ని కలిగిస్తున్న ప్రకియ వచన కవిత అనుకుంటే, దానిని తలదన్ని మనముందు నిలిచింది మినీ కవిత. ఈ 'మినీకవిత' మీద పరిశోధించి, తాత్వికమైన పరిశీలనను గావించి ఒక సంపూర్ణమైన గ్రంథమును మొదటగా తెలుగు దేశము పైకి వదిలాడు

మినీ కవిత ఎంత సంచలనం కలిగి
స్తుందో, ఈ సమీక్షా గ్రంథము అంత
సంచలనము కలిగించి, మినీ కవిత చెప్పే
ప్రతి వారికీ, సాహితీ ప్రియులకు కరదీ
పిక అయి నిలుస్తుంది, అనుటలో
మాత్రం సందేహం లేదు

వచన కవితా ప్రపంచములో ఒక
యౌవన రూపముతో మనముందు నిల్చి
నది మినీ కవిత ఈ మినీ కవిత క్షత్రి
అనే ఉచ్ఛ్వాసంతో, ధ్వని అనే
విశ్వాసంతో మనముందుకు వచ్చి నిలిచింది
ఈ మినీ కవితకు ఉన్న ప్రజాదరణ
చూస్తుంటే కవితాప్రాయం చెల్లిన ప్రసి
ద్ధులైన (ముసలి) కవులు కూడ భయ
పడుతూ మినీ కవిత రాస్తేనే గాని
కాలం కనికరించదేమో అన్న సందే
హంతో, మినీకవితలు చెప్పడానికి నాన
అవస్థలు పడుతున్నారు.

కవిత్వంలో మేలుకున్న ప్రతి యు
వకుడూ, ఏదో ఒక శిల్ప చమత్కారం
లేనిదే కవితలు రాయడానికి పూన
కోవడం లేదు దీనికి బాగా దోహదం
చేస్తున్నది 'మినీ కవితా' ఉద్యమం.

ఈ మినీకవిత తనకొక విశిష్టత కలిగి,
ప్రత్యేకమైన ప్రక్రియ అలాగే ఒ
భావమును అభివ్యక్తీకరించడములో
తనదైన శిల్పము గల స్వరూపం కలది
ఒకే ఒక్క భావాన్ని సాధ్యమైనం
శక్తిమంతంగా, హృదయంలో ముద్రపడే
టట్లు, ధ్వని పూర్వకముగా చెప్పడాని
ఉరికివస్తుంది మినీ కవిత

దీర్ఘ కవితలోని అన్ని అంశాల్ని
పాఠకుడు బాగా గుర్తుంచుకోలే
పోవచ్చుగాని, మినీ కవితవల్ల కలి
ముద్రని మాత్రం బాగా జ్ఞాపకం పెట్టు
కోగలడు. దీని వలన మినీ కవిత మన

శక్తి చాలా విశిష్టమైంది, విస్మరించరానిదని ఘంటాపథంగా చెప్పవచ్చును. మినీ కవితలో శిల్పవైవిధ్యం ప్రధాన విషయం కాదు ఒక వస్తువును ఉజ్వలం చేసే శిల్పము మాత్రమే అవసరము.

మినీ కవితలో ఒక విధమైన శిల్పవైచిత్రి పరాకాష్ఠను తీసుకు పోతోంది. మినీ కవితలో ఉన్న ఆ శిల్పాన్ని గ్రహించినవాడు. అపరిధిలో తన యొక్క భావమును అద్భుతంగా చెప్పగలడు తమభావాలను తీవ్రంగా చెప్పాలనే యువకవుల తపన పరిమాణంలో చిన్నదిగానుండే మినీ కవితకి బాగా అడ్జస్ట్ అవడంతో, ఆరూపం అపరిమితముగా ఆకర్షణకు లోనయింది అనుటలో అతిశయోక్తి ఏమాత్రం లేదు ఈ ఆకర్షణే ఉద్యమమంతటి ఊపుని యువకవుల్లో రగిలించిది అంతేకాకుండా కవితాయాత్రికుడికి ఇది 'చలివేంద్రం' అయింది.

వాచ్యతాదోషం ఎక్కువ అయిపోతున్న వచన కవితకి వ్యంగ్య వైభవాన్ని నేర్పిన మినీ కవిత, కవి ప్రతిభకు నికషోపలం లాంటిది అయింది. నిజమైన మినీ కవిత చదివిన తర్వాత చాలాసేపు ఆలోచింప చేస్తుంది చెప్పదలచిన భావాన్ని, సూటిగా చెప్పక, భంగ్యంతరంగా చెప్పి, హృదయం మీదఎక్కువ ముద్రవేస్తుంది. ఈ సందర్భములో కాళోజీ నారాయణరావుగారు చెప్పిన 3 వాక్యాల కవితను చూడవచ్చును. అదీ జయప్రకాశ్ నారాయణ్ గారు చనిపోయినప్పుడు.

'పుటక నీది,
చావు నీది,
బ్రతుకంతా దేశానిది'

మినీకవిత "అల్పాక్షరముల అనల్పార్థ రచన" అనేదానికి మొదటి ఉదాహరణ. ఈ మినీకవిత ఎలా ఉద్భవించిందో సోదాహరణంగా చెప్పుతూ, భావావిలాసం, గురజాడ కవితలలో శ్రీశ్రీకవితలో మృచ్ఛకటికంలో నుండి చూపెట్టారు ఈ మినీకవిత 1970 ప్రాంతంలో ప్రారంభము అయినప్పటికీ, ఒక ఊపుగా, వేగంగా 1975 సం॥ తర్వాత వెల్లువలా రావడం మొదలెట్టింది.

మినీ కవిత సాధారణంగా 10, 12 పంక్తులకు మించకుండా ఉండి ఒక ధ్వనితో, శిల్పస్పృహతో సూటిగా, గుండెలో చురకత్తిలా చొచ్చుకుపోయే విధముగా ఉంటుంది. ముఖ్యంగా నాలుగు విధముల ప్రోత్సాహముతో మనముందుకు వచ్చింది మినీకవిత

మినీకవితకు క్లుప్తత జీవనాడి విస్తృతంగామాటలుగాని, ఉపన్యాసాలుగాని పునరుక్తులుగాని అప్రస్తుత విషయాలు చెప్పడానికిగాని అసలు అవకాశం లేదు మినీ కవితలో

వచన కవితలో శిల్పం అనావశ్యకమనే విపరీతవాదములవలన భావస్పందన పొందడానికి అవకాశము లేకుండా పోయింది వచనకవితలో కవితాశిల్ప స్థాయి లక్షణాలు కనబడగానే మినీ కవిత వెంటనే ఆకర్షించింది. మినీ కవితలో వాచ్యంకంటె వ్యంగ్యం ముఖ్యం. ధ్వని మినీకవితకు ప్రాణనాడి. కొద్దిలో తన భావాన్ని పాఠకుడి మనస్సులో ముద్రవేయాలంటే తప్పనిసరిగా ధ్వనిని ఆశ్రయించాలి చెప్పినదానికన్నా, చెప్పనిదాన్ని ఎక్కువగా చెప్పాలి ఈ లక్షణం మినీకవితలో ముఖ్యముఅయింది కాబట్టే ఈనాటి యువకవులందరికీ అత్యవసరముగా కనిపించింది.

వచనకవితలో అస్పష్టత ఎక్కువ అయి, ఈ అస్పష్టతనుండి మనలను రక్షించడానికి మినీకవిత బాగా ఉపయోగపడింది తన భావాన్ని అస్పష్ట అనుభూతిలోకి కాకుండా విస్పష్టస్పందనలోకి కొద్ది పంక్తులతో తెచ్చితీరవలసిన అవసరం కవికి ఉండడమువలన ప్రజలకు గొప్ప రిలీఫ్ ఇచ్చింది అని ఘంటాపథంగా చెప్పవచ్చును.

వచనకవితలో భాషాభేషజం చూపించే అవకాశం ఉన్నంతగా మినీ కవితలో లేకుండా మినిమైజ్ అవుతుంది భావస్పందనే ప్రధానరేఖ అయిన మినీ కవితలో నిలబెట్టే భాషకోసం పరిగెత్తే భావం ఆగడానికి వీలులేదు

మినీకవితలో భావాభివ్యక్తిలో కొత్త కొత్త అవకాశాలు చాలా చూపించింది వాళ్ళ ఆలోచనలకు కొత్త ద్వారాలను తెరిచింది అంతేకాకుండా తమ భావాలను కొద్దిలో సూటిగా, చక్కగా బాగుగా చెప్పుకునే సాలభ్యాన్ని అధికం చేసింది. మనస్సులో చెలరేగిన ప్రతి తళుక్కునీ, చిన్న కలికగా మన ముందుంచే అవకాశము కల్పించింది అని ఘంటాపథంగా చెప్పవచ్చును. ఇక్కడ 'జింబో' కవితను చూడవచ్చును.

'నే చచ్చిపోతానని కదూ
నీ బాధ
పిచ్చివాడా
ఈ వ్యవస్థలో మనం బతికింది
తొమ్మిది మాసాలే !'

ఇంతేకాకుండా మన సమాజంలోని మూఢవిశ్వాసాల్ని అనేక విధాలుగా తిట్టడంకంటె, కేవలం సహజంగా జరిగే ఒక సంఘటనను తీసుకుని, సమాజాన్ని విమర్శించేపద్ధతి ఎంతో చక్కగా ఉండి గుండెపై హత్తుకుంటుంది అటువంటి కవితల్లో వచ్చిన ఈకవితను చూడండి_

అమ్మా ! కుంటాణ్ణి
పోయిరా !
తల్లీ ! గుడ్డోణ్ణి
వెళ్ళిరా !
మాతల్లీ ! ముసలోణ్ణి
పో ! పో !
ఏడుకొండలవాడా ! వెంకటరమణా !
వస్తున్నా ! ఉండు !'

మినీ కవితలలో కొన్ని కవితలు మామూలు వాక్యాలే మామూలుపదాలే. చిన్న చిన్న విరుపులకల్ల చివరిదాకా ఒక శక్తిని పుంజుకుంటూ వచ్చి, చివర ఒక

మెరుపు (Flash) తో గొప్ప వ్యంగ్యాన్ని సాధిస్తాయి వాటిలో ఈ కింది వితను చెప్పుకో వచ్చు.

'నేనిలా లేని
నాలుగ్గోడలమధ్య
పగిలిన
కుండల్లో
కాలని కట్టెల్లో
వొండుకొని
పొగ నంజు కుని
తింటుంటే
ఓ టని భిక్షం
అడిగేంత్కు
సిగ్గులేదు రా !

ఈవిధముగా మినీకవితలను ఉదాహరణలుగా చూపెట్టుతూ వాచిక ప్రాధాన్యమును చూపెట్టారు.

ఇంతేకాకుండా 'మినీకవిత' సామాజికవస్తువాహికగా ప్రధాన స్థానం ఆక్రమిస్తోంది ఒకప్పుడు పాట ఒక్కటే సమకాలీన(విప్లవ) కవితాప్రక్రియ కావాలని నిర్ణయించుకున్న విప్లవకవులు కూడా మినీకవితని ఉపయోగించుకోవడం గమనార్హం ఇక్కడ అంతే కాకుండా యువకులలో కూడా కవిత్వ స్పృహ బాగా పెరిగింది.

మినీ కవితల్లో సామాజిక చైతన్యం ప్రధాన వస్తువుగానే ఉంది. ఒక దృష్టి దృక్పథమూ, వ్యక్తిత్వానికీ, కవిత్వానికీ, ఒక స్వచ్ఛమైన సంబంధమూఉంది వీటి లోపాలు విశ్వరూపాలుగా మారకుంటే ఈనాటి మినీ కవిత్వం మొత్తం వక్ర మార్గము పట్టలేదని, ఇంకా ఇంకా భవిష్యత్ సమాజానికి సహకరించబోతోంది దని నిర్ణయానికి రావడం అత్యాశగా కనిపించ దని 'మినీకవిత' మీద తత్వపరిశీలన చేసి మన ముందుంచారు ఒక సమగ్రమైన పుస్తకాన్ని అద్దేపల్లి వారు అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు

'మినీ కవిత
ముద్దు ముద్దుగా
వుంటూనే
చర్రుమనిపించే
పొట్టి కవిత
గుండెల్లో గుచ్చుకునే
గట్టి కత కాదా!
కుంభకర్ణుడికన్నా
వామను డెక్కువకదా!'

'అని' మాధవీసనారా' అన్నట్లుగా మన ముందుకు వచ్చి నిలిచింది మినీకవిత.

మినీ కవిత—సమీక్షా గ్రంథం, అద్దేపల్లి రామమోహనరావు. ప్రభాకర పబ్లికేషన్సు, 54-5-5, శివాలయంవీథి, కాకినాడ 533001; పుటలు 60, క్రౌన్ సైజు వెల 3-00

---

# ఋతు విలాసము

— శ్రీ డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ., పిహెచ్.డి.

**వసంతము**

'ఫుల్లని మావికాయ లివె,
పొల్తిరొ! క్రొత్తగు నావకాయపై
నుల్లము వోయెఁ బెట్టు' మన,
నుగ్మలి పెట్టఁ, బ్రియుండు తుష్టుఁడై
మల్లెలఁ దెచ్చిపెట్ట, నవ
మానిని దాల్పఁ, బికాలి కూఁతలన్
జల్లని దక్షిణానిలమునన్
దమిపైకొన నామె ముద్దిడెన్.

**గ్రీష్మము**

వీచిన వేఁడిగాడ్పులకు
వెట్టయు, వీవమి మేనఁ జెమ్మటల్
దోఁచుటఁజేసి, బల్ తృషను
దొట్రిలుచుండుటఁ జేసి, మారుఁడున్
బీఁగ మడంగ, గ్రీష్మమున
బిగ్గ కవుంగిలు లేమి లేకయే
యేచని మోహపుం బనుల
నెట్టులొ పుచ్చిరి దంపతుల్ నిశల్.

**వర్షము**

ఎడతెగకుండ వానపడి
యెంతకు నింటికిరాక రేయొటో
తడసి ప్రియుండు రా సుదతి
తద్దయు శంక మెయిన్ ముఖాబ్జమున్
ముడిచి పరుండఁగా, నవలి
మోమయి యాతఁడుఁ బండె, నంతలోఁ
బిడుగుల చప్పుడై యువతి
బిగ్గ కవుంగిటఁ జేర నాతఁడున్
గడు ముదమంది నెమ్మనము
నన్ బ్రణమిల్లెను వానదేవునిన్.

**శరత్తు**

తెల్లువగట్టి పాల్కడలి
పృథ్వితలమ్మునఁ గ్రమ్మినట్లు, సం
ఫుల్ల సుగంధి కైరవ స
మూహముఁ జల్లినయట్లు వెన్నెలల్
చల్లఁగ నెల్లెడం బరఁగ,
జాయను దెల్లని కల్వపూలు ధ
మ్మిల్లమునందుఁ బెట్టి యొల
మిన్ దెలిచీరధరింపఁ గాంచి తా
నుల్లముఁ బట్టలేక తమి
నొంది ప్రియుండు రసాబ్ధిఁ దేలిచెన్.

**హేమంతము**

'ఈచలి కేది మందు, తరు
ణీ?' యన నాథుఁడు, చట్టదుప్పటిన్
వే చెలి తెచ్చి కప్ప, 'నిది
వేఱొకదానను గాని పోదు లే
వే, చలికైన మందు చెలి
యే' యని పల్కి ముసుంగులోనికిన్
ద్రోచి యురమ్మురమ్మొదమ
తోఁచని యట్లు కదించె నచ్చెలిన్.

**శిశిరము**

తలగడు గాడు ధాత పరి
ధానముఁ దాలిచి, తాల్పకే విభూ
షల, నెఱులన్ దదార్చుకొను
జాయను జూచి విభుండు, వాకిటన్
గలిత లతాంతపత్రమయి
కన్పడు న వ్విరజాజి తీవనుం
బలెఁ గనుపట్టఁ దత్సహజ
భాసురరూపము మెచ్చి ముద్దిడెన్.

ఇట్టు లా దంపతులు సకలర్తువులను
రాగరసవార్ధి నోలాడి రంజిలంగ
శిశిర మెడలి వసంతమ్ము చేరునాఁడు
నూనుఁ గనిరి వసంతునిఁ బోనివాని.

# తెనాలికవులు - సాహిత్యసేద్యం

- శ్రీ మంతెన సూర్యనారాయణరాజు, ఎం.ఎ. బి.ఓ.ఎల్.

తెనాలికవులు అనగానే తెనాలి ఇంటి పేరు కలిగిన వారని స్ఫురిస్తుంది. వారు వెలయించిన కావ్యాలు, వాటికి తెలుగు సాహిత్యంలో ఉన్న స్థానం ఎటువంటిది అనే విషయం, మనం చర్చించడమే ఈవ్యాసంలో గల సారాంశం. మనకు తెనాలి కవు అనగానే తెనాలిరామకృష్ణుడు ముందుగా గుర్తుకొస్తాడు తెనాలి రామలింగడు తెనాలిరామకృష్ణుడెలా అయ్యాడనే సందేహం కలగొచ్చు తొలుత రామలింగడు శైవుడట. అనంతర కాలంలో అతడు వైష్ణవాన్ని స్వీకరించి రామకృష్ణుడయ్యాడని ఐతిహ్యం

రామకృష్ణుడు 'సురారామగజము' అని పేరు పొందినవాడు. పాండురంగ విభుని పదగుంభనంబు ప్రసిద్ధము. చాలా ప్రౌఢకవిగా నితడు ప్రసిద్ధుడు ఆంధ్ర దేశములో ప్రసిద్ధకథల కాలవాలమైన రామకృష్ణునకు, ప్రౌఢకవిగా ప్రసిద్ధి కెక్కిన రామకృష్ణునకును సంబంధము గట్టిగా స్థాపింపబడలేదు. ఇతడు ఆకాలపు ప్రబంధ కవులకంటె విలక్షణుడై తన కావ్యములలో భక్తిని ప్రబోధంచేసాడు. ఇతడు శైవుడుగా ఉన్నప్పుడు ఉద్భటారాధ్య చరిత్రమును రచించెను ఉద్భటారాధ్య చరిత్రము ప్రౌఢప్రబంధమే! అందులో శైవధర్మములు ప్రస్తుతింపబడ్డాయి. ఇతడు రచించిన మిగిలిన రెండు గ్రంథములు వైష్ణవ ప్రతిపాదకములు 1 పాండురంగమాహాత్మ్యము 2 ఘటికాచల మాహాత్మ్యము.

ఈ రకంగా ఈతడు క్షేత్ర మాహాత్మ్యములను వర్ణించిన వాడు పాండురంగ మాహాత్మ్యాన్ని ఒక రాజుకు కాకుండా వ్రాయసకానికి అంకిత మిచ్చినాడు. విరూరివేదాద్రి దాని కృతిభర్త. ఈతడు కవిని గుఱించి 'శారద నీరూపము' అని నాడు ఇతడెందరో గొప్పకవులకంటె గొప్పగా వ్రాసాడు. పాండురంగ మాహాత్మ్యమున గల నిగమశర్మోపాఖ్యానము అందులో గల సంవాదములు చాల ప్రసిద్ధి పొందినవి అందులో పేరు తెలియని నిగమశర్మ అక్కయొక్క వాక్య విన్యాసము, చాతురి, ముచ్చట గొలుపుచుండును.

'ప్రారంభించిన వేదపారమునకున్
 ప్రత్యూహ మానంచునో
ఏరా! తమ్ముడ నన్ను జూడచనుదే
 వెన్నాళ్ళ నోయుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నిను గ
 న్గొనక్క మీబావయున్
నీరాకల్ మది గోరు చంద్రుపొడుపున్
 నీరాకరంబుం బలెన్'

ఇందులో ఎంతో ఔచిత్యం కనపడుతూంది. వంశాన్ని గురించి చెబుతూ - పిల్లిశీలమని, చదువులన్నీ చిలక చదువులని చెప్పారు. తోడి వాళ్ళంతా నవ్వుతున్నారు పొలాలన్నీ అమ్మివేసినావు కులభ్రంశం చెయ్యటం తగునా-సర్వధనములు ఖర్చుపెట్టుట నీకు తగునా! వెనక ఎవ్వరూ లేరా? చిన్న చిన్న పిల్లలు, నీ భార్య, కలరు. ఎందు కిట్లు కులధ్వంసం చేయు-? ఇది నీకు తగదని మందలించినది

నిజమునకు నిగమశర్మ యంతటిపాపిష్ఠి బ్రతుకు బ్రతికిన వాడు లేడు. కాని వాడు చివరికి మోక్షమును పొందుటయే చెప్పుకొన దగిన విషయము అతడు కళింగాంధ్రములోని నృసింహక్షేత్రమందు మరణించి మోక్షము పొందినాడు

తెనాలి రామకృష్ణునితో పాటుగా ఆవంశీయులలో మరికొందరు కవులు కలరు. వారు కూడా మృదుమధురములైన కావ్యములను రచించినవారైనను తెనాలి రామకృష్ణుని ప్రతిభలో నిమగ్నులైనారు. అందు శ్రీగిరి అనునతడు ఒకడు. ఈయన రామకృష్ణుని పెద్దతమ్ముడు. 'శ్రీశైల మాహాత్మ్యము' ను రచించినట్లు ఇతని మనుమడైన రామభద్రకవి చెప్పుటచే తెలియుచున్నది. కాని ఈ గ్రంథము నేడు అలభ్యము.

అప్పన్న అనునతడు రామకృష్ణుని రెండవ తమ్ముడు ఇతడు 'సుదక్షిణా పరిణయము' అను ప్రబంధమును రచించి పులిజాల సోమయ్యకు అంకితమిచ్చినాడు. ఈ గ్రంథము ఐదు ఆశ్వాసములలో కూర్పబడినది కాళిదాస మహాకవిచే రచింపబడ్డ 'రఘువంశము'నుండి దిలీపుడు సుదక్షిణాదేవిని పరిణయమాడిన ఇతివృత్తమును గ్రహించి ఇతడీ ప్రబంధమును అష్టాదశవర్ణనలతో ప్రబంధధోరణిలో రచించినాడు వసుచరిత్రాది మహాప్రబంధముల ఛాయలు ఈ గ్రంథమందు అచ్చటచ్చట గోచరించును

ఈ తెనాలి కవులలో రామకృష్ణుని పెదతమ్ముని కొడుకు ఇమ్మడి రామకృ

ష్ణుడు. సంస్కృతాంధ్రములలో కీర్తి పొందినట్లుగా ఇతని కుమారుడు రామభద్రకవి తన 'ఇందుమతీ కల్యాణము' న తెలిపినాడు. ఈరామకృష్ణుడు ఏఏ కావ్యములను రచించెనో అతడు చెప్పకపోవుటచే బహుశః చాటుపద్యములను మాత్రమే రచించియుండవచ్చును. రెండవ రామకృష్ణుని పెద్దకొడుకు వీరరాఘవుడు. ఈతడు సరసకవితా మహత్వమున తాత తండ్రులను మించినవా డని రామభద్రకవి చెప్పుటచే కవియై యుండును. కాని అతడు రచించిన కావ్యములు ఏవియో తెలియుటలేదు ఈ తెనాలి కవులలో రెండవ రామకృష్ణుని చిన్నకొడుకైన రామభద్రుడు 'ఇందుమతీ పరిణయము' అను నాలుగు ఆశ్వాసముల కావ్యమును రచించి పాలమూరి కృష్ణభూపాలునకు అంకిత మిచ్చినాడు ఇందులో తాను ప్రాజ్ఞహృదయాబ్జ రవి నని కవి చెప్పుకొనినాడు

తెనాలి కవులకు సన్నిహితులైన బంధువులలో కొందరు కవిపుంగవులు కలరు. అందు 'లింగమగుంట సర్వకవి' యొకడు ఈతడు 'ఆది పురాణము' రచించియుండు నని విమర్శకులయూహ ఈతని రచనలు బహుళ ప్రచారము నంది యుండును, అనుటకు పెద్దపాటి ఎల్లన తన 'మల్హణచరిత్ర'లో ఈ కవిని స్తుతించుటయే కారణమని ఊహ ఈకోవలో 'లింగమగుంట రామయ్య' కూడ స్మరింపదగిన వాడు ఇతడు తెనాలి రామకృష్ణుని అల్లుడు బహు గ్రంథకర్త ఇతడు రచించినకృతులలో 'ఆనందకానన మాహాత్మ్యము', 'చతుర్వాటికా మాహాత్మ్యము, అను రెండు గ్రంథములే లభించుచున్నవి. తక్కినవి నామ మాత్రములుగ మిగిలినవి.

ఈ తెనాలివారి బంధువులలో 'లింగమగుంట తిమ్మకవి' మిక్కిలి ప్రసిద్ధుడు. ఇతడు తెనాలి రామకృష్ణుని అల్లుని తమ్ముడు. ఇతడు రచించిన గ్రంథము సులక్షణ సారము' ఛందోగ్రంథములలో నది మిక్కిలి ప్రసిద్ధికెక్కినది ఈసులక్షణ సారకర్తృత్వము వివాద గ్రస్తమైనది వెల్లంకి తాతంభట్టు దీనిని రచించినట్లుగ కొంత ప్రచారము కలిగినది అట్లే ఇతడు 'బాలబోధ'చ్ఛందము, అనే మరోగ్రంథమును గూడ రచించినట్లుగ తెలియు చున్నది

ఏతావతా చెప్పేదేమంటే తెనాలి గృహనామం కలిగిన వారందరూ తెనాలి రామకృష్ణునకు సోదరులో, జ్ఞాతులో అయినవారే అల్లుండ్రకు కూడ కవిత్వమబ్బుట పరికించినచో, వారి జీవితములు తెలుగు భాషామతల్లికి ఎంత సన్నిహితములైనవో వేరే చెప్పనవసరము లేదు

## వనిత

డా. ఎన్. శ్రీధరరావు.

*వనితా! నీ శుభవీక్షణమ్ములకు నా
వైకుంఠుఁ డుత్సాహియై
తన వక్షఃస్థలపీఠికన్ దిరముగాఁ
దానుంచికో లేదో? ని
న్ననిన్ దేవుని యంత వాని యెడఁదన్
స్థైర్యమ్ము లే కున్నచో
జనసామాన్యుని మాట చెప్ప నగునా
చర్చింపఁగా నెంతయున్

*భువనశ్రేణుల యందుఁ బెద్దయయి, సం
పూర్ణాత్మ విద్యా విభూ
తి వివేకంబులు గల్గియున్ జడుని భా
తిన్ నాతి నొక్కర్తుఁ దా
నవశుండై తననోట నుంచికొనఁడే
యాబ్రహ్మ, యీ విశ్వమం
దవురా! నిన్నని నీకు లోఁబడని ధ
న్యాత్ముండు గాన్పించునే?

*గిరిశుం డక్కట పంచబాణుని పయిన్
గించిత్తు కోపమ్ము చూ
పఱుపం జూపుచు లేము నొక్కనిని సం
భావించి యర్ధాంగిగా
నెఱపెన్ గాదె? గణింపగా వనితకున్
విశ్వంబె దాసోఽహమం
చొఱపై చెప్పిన రీతిఁ గన్పడుచు నెం
తో చోద్యముం గూర్చెడిన్.

*వనితా! యూర్వశిగాను, మేనకగ, రం
భాసుందరీభాతిగా,
జనకక్ష్మాపతి పుత్రిగా, నల యశ
స్సంపన్న యా భైమిగా,
జనదృగ్భీకరుఁ డైన యంతకునిప
జ్జన్ బోవు సావిత్రిగాఁ
గనమా నిన్ భవదీయమా గరిమమున్
గర్వించు చెల్లప్పుడున్.

*ఒక మాటు తల్లివై సకలలోకాలను
బెంచిన ధన్యతఁ గాంచ లేదొ?
ఒక పరి చెల్లివై సకలమానవులను
ప్రేమించి కీర్తితో వెలయ లేదొ?
ఒక తఱి దుహితవై యొప్పుల నొలికించి
తలిదండ్రు లింటిలో మెలఁగ లేదొ?
ఒకచోట గృహిణివై యొప్పుతప్పులనెల్ల
భర్తకుఁ జూపి పేర్వడయలేదొ?
విశ్వమోహనమైన నీ వింత సొబగు
నూఁతగొని భూమినెల్లనుఱ్ఱూఁతలూపఁ
జాలి యుండవొ? నీ శక్తిఁ జాటి చెప్పు
లోకసాహిత్యమే సాక్షి గాక యున్నె?

# పురాణములు - భక్తి

- శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం. ఏ

(గతసంచిక తరువాయి)

**శాక్తేయ భక్తి మార్గము** - 'అమ్మ' కంటె మధురమైన భావన మానవునకు వేఱొకటి లేదు ఎనలేని ప్రేమకు, వాత్సల్యమునకు, కారుణ్యమునకు, పవిత్రతకు మారుపేరు మాతృమూర్తి దైవమే మానవునకు ప్రియతముడను భావము గలదు. అద్వైతము తల్లిరూపమే అయిన భక్తునకు దైవమునకు గల అను బంధము మరింత దృఢతరమై నిలచును. అందులకే 'నీవే తల్లివి' అని వేద ఋషులు దేవుని ప్రార్థించిరి. ఇట్టి మాతృభావనలోనుండి దేవి నారాధించు పద్ధతి రూపు దిద్దుకొన్నది పరతత్త్వమును మాతృరూపమును ఉపాసించు పద్ధతి వేదకాలమునందే సూచన ప్రాయముగ చూపట్టినది ఋగ్వేదములో పేర్కొనబడిన 'అదితి' సర్వలోక జనని, విశ్వధాత్రి, ముక్తి ప్రదాయిని, ఆమెయే ఆత్మస్వరూపిణి 10

కృష్ణ యజుర్వేదములోని తైత్తిరీయ ఆరణ్యకము కూడ దేవిని గూర్చి చెప్పుచున్నది. 11 ఆదిశక్తియే సకల ప్రాణుల యందును శక్తి రూపమున అధివసించునని కేనోపనిషత్సారాంశము ఋగ్వేదము కూడ నిట్లే పేర్కొనుచున్నది 12

వేదోపనిషత్తులు నిరూపించిన ఆది శక్తితత్త్వము నాశ్రయించు కొనియే శాక్తేయపురాణములు దేవీ స్వరూపమును మహిమలను, ఉపాసనా ప్రణాళికను, విస్తృతముగా వర్ణించినవి దేవీభాగవతము, మార్కండేయ పురాణము, కాళికా పురాణము, దేవీపురాణము, మహాభాగవతము, మున్నగు పురాణములు దేవీ మాహాత్మ్యమును వెల్లడించు చున్నవి మార్కండేయ పురాణాంతర్గతమగు సప్తశతీ చండి దేవీమాహాత్మ్య ప్రతిపాదకము బ్రహ్మ వైవర్త పురాణములోని ప్రకృతి ఖండము, శివపురాణాంతర్గతమగు ఉమా సంహితా ప్రకరణము, లలితోపాఖ్యాన ప్రకరణములు, ఆదిశక్తి మహిమలను, సాధన పద్ధతులను వివరించుటలో చెప్పదగినవి

మహాభాగవతమున భగవతీగీతలు దేవీ పరమేశ్వరీ భావమును వర్ణించును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపములలో తానే సృష్టి, స్థితి, లయకార్యములను నిర్వహించుచున్నట్లు పల్కెను.

'సృజామి బ్రహ్మ రూపేణ
జగ దేత చ్చరాచరమ్।
సంహరామి మహారుద్ర
రూపేణాన్తే నిజేచ్ఛయా ॥
దుర్వృత్త శమనార్థాయ
విష్ణుః పరమ పూరుషః।
భూత్వా జగదిదం కృత్స్నం
పాలయామి మహామతే॥'

మార్కండేయ పురాణాంతర్గతమగు సప్తశతీచండి యందు బ్రహ్మ, దేవిని స్తుతించుచు

'విష్ణుః శరీర గ్రహణ
మహ మీశాన ఏవచ।
కారితా స్తే యతోఽత స్త్వాం
కః స్తోతుం శక్తిమాన్ భవేత్ ॥'

అని త్రిమూర్తులకే శక్తి నొసంగ జాలిన పరతత్త్వమును వివరించెను.

నీలకంఠుడు తన 'దేవీభాగవతటీక' లో ఉపక్రమణిక యందు జగన్మాత మాహాత్మ్యమును వివరించెను కరుణా సముపేత యగు జగజ్జనని కంటె పూజనీయులు లేరని, ఆమె నారాధింపజాలని వారి జన్మ వ్యర్థ మని యాతడు నిష్కర్షగా చెప్పెను

'ఆరాధ్యా పరమా శక్తిః
సర్వై రపి సురాసురైః।
మాతుః పరతరం కించి
దధికం భువన త్రయే॥
ధిగ్ ధిగ్ ధిగ్ ధిక్ చ తజ్జన్మ
యో న పూజయతే శివాం।
జననీం సర్వజగతః
కరుణా రససాగరమ్॥'

శాక్తేయ పురాణము లిట్లు మాతృభావము నాధారము గావించుకొని దేవి నారాధించుట వలన కలుగు విశేషఫలితములను గూర్చి పునఃపున్య ఉద్ఘోషించుచున్నవి

**శరణాగతి** - భక్తిలో శరణాగతి, ఆత్మనివేదనములు ఉత్తమము లైనవని మన సంప్రదాయము దైవ కృపను పొందుటకు శరణాగతిని మించిన సాధనము వేఱొకటి లేదు. ఆది కావ్యమైన శ్రీమద్రామాయణములో విభీషణ శరణాగతికి విశేషమైన ప్రాశస్త్యము గలదు మహాభారత హృదయమని పేరొందిన భగవద్గీతయు శరణాగతి విశిష్టతను చాటుచునే యున్నది సర్వశక్తి సమన్వితుడైన సర్వాంతర్యామిని శరణ వేడిన మానవుని పాపము గాని, శోకము గాని దరిజేరవు ద్వైతసంప్రదాయములో శరణాగతి శ్రేష్ఠమైన భక్తి సాధనము. దేవీ భాగవతమునం దిట్లున్నది

'అపరాధో భవత్యేవ
తనయస్య పదేపదే।
కోఽపరః సహతే లోకే
కేవలం మాతరం వినా॥
తస్మాత్ యూయం పరాంబాం వా
శరణం యాత మాతరం।
నిర్వ్యాజయా చిత్త వృత్త్యా
సా వః కార్యం విధాస్యతి॥'

బిడ్డ యెన్ని యపరాధము లొనర్చినను, తల్లి కంటె క్షమించువారు లేరని

శరణువేడిన వారికి జగన్మాతయే అభీష్ట సిద్ధి గల్గించునని దేవీ గీతలు.

భోగ, స్వర్గ, మోక్షముల నిచ్చునది జగన్మాతయే యని, ఆమెను శరణువేడిన వారిని, ఆరాధించిన వారిని, ఆమె కరుణించు నని మార్కండేయ పురాణము సమర్థించుచున్నది.

'తా ముపైహి మహారాజ
శరణం పరమేశ్వరీం।
ఆరాధితా సైవ నృణాం
భోగ స్వర్గాపవర్గదా'

మానవుని పాప విముక్తుని గావించునది శరణాగతియే యని మన నమ్మకము.

నిర్గుణభక్తి- సగుణ నిర్గుణ భేదముచే భక్తి రెండు విధము లని భాగవతము ప్రతిపాదించుచున్నది సగుణ భక్తి తామస, రాజస, సాత్త్విక భేదము ననుసరించి మరల మూడు విధములు. హింసా దృష్టితో దంభ, మాత్సర్య, క్రోధముల వలన గావించు పూజావిధి తామస మని, భోగైశ్వర్య యశస్సుల యందలి కోర్కతో చేయు నుపాసనము రాజస మని, కర్తవ్య బుద్ధితో కలుష క్షయమును గోరి గావించు అర్చావిధిసాత్త్విక మని తెలుపబడినది. భేదదర్శన మీ మూడింటి యందును సామ్యము సాధకుని స్వభావప్రవృత్తులు నశించి, భక్తుని యంతః కరణము వినిర్మలమగుటకు వలసిన అభేద భావనకు, అద్వైత సిద్ధికి అవకాశములేని దగుటచే సగుణ భక్తి శ్రేష్ఠము కాదు ఇందు సాత్త్విక భక్తి ఉత్తమమైన దైనను, సర్వోత్తమము మాత్రము కాజాలకున్నది. సాత్త్విక భక్తి యందు మోక్షేచ్ఛ గలదు కదా! మోక్షము పై కోర్కెను సైతము పరిత్యజించి, భక్తుడు భగవానునే కామ్య వస్తువుగా గ్రహించు స్థితికి చేరుకొనవలసియున్నది అట్టి దశలో ఆ భక్తి నిర్గుణ భక్తి' లేక 'అహైతుక భక్తి' ఇదియే భక్తి సంప్రదాయములో 'ప్రేమ భక్తి'గా పేర్కొన బడినది

సర్వగుణాశ్రయుడైన సర్వాంతర్యామియందు గుణ శ్రవణ మాత్రముననే కలుగు భక్తి నిర్గుణ భక్తి సాగరములో సంలీనమగుటకు గంగా ప్రవాహము వేగిర పడునట్లు, అవిచ్ఛిన్నముగ, ఫలాపేక్షా రహితముగ, అభేదమైన మనః ప్రవృత్తితో భక్తుడు భగవానుని కోరుట నిర్గుణ భక్తి ధర్మము

'మద్గుణ శ్రుతి మాత్రేణ
మయి సర్వగుణాశ్రయే।
మనో గతి రవిచ్ఛిన్నా
యథా గంగాంభసోఽంబుధౌ॥

లక్షణం భక్తి యోగస్య
నిర్గుణ స్యహ్యు దాహృతమ్
అహైతుక్యవ్యవహితా
యాభక్తిః పురుషోత్తమే॥
సాలోక్యసార్ష్టి సామీప్య
సారూప్యై కత్వమ ప్యుత।
దీయమానం న గృహ్ణంతి
వినా మత్సేవనం జనాః॥'

నిర్గుణదశలో భక్తుడు భగవత్సేవను మాత్రమే కాంక్షించును ముక్తిపదవిని కూడ అభిలషింపడు నిర్గుణభక్తిదశ ఉత్తమోత్తమమైనది.

సర్వత్ర 'సమదర్శనము' గల యోగిని గూర్చి భగవద్గీత ప్రశంసించుచున్నది.14 అట్టి ఆత్మదర్శనము, సమదృష్టి నిర్గుణ భక్తి దశలోనే సాధ్యమగును ఈదశలో భక్తుడు సకలప్రాణులయందు నొక్కే 'ఆత్మ'ను చూడగల్గును. స్వపర భేదము గాని, శత్రు మిత్రభావము గాని అతని హృదయము నంటజాలవు.

'సర్వభూతేషు యః పశ్యే
ద్భగవద్భావ మాత్మనః।
భూతాని భగవ త్యాత్మ
న్యేష భాగవతోత్తమః॥'
'న యస్యస్వః పర ఇతి
వి త్తేష్వాత్మని వాభిధా।
సర్వభూతసమః శాన్తః
సవై భాగవతోత్తమః॥'

తన ఆత్మయందున్న భగవానునిలో సకలప్రాణులను, సకల పాణులయందు ఆత్మరూపమైన భగవానుని చూడగల సర్వోత్తముడైన భక్తు డని, సమదృష్టి గలవాడు, స్వపరభేదభావము లేనివాడు ఇంద్రియ నిగ్రహము గలవాడు భాగవతోత్తముడని, భాగవతము నిర్దేశించుచున్నది. నిర్గుణభక్తిలో మాత్రమే భక్తుడీస్థితికి జేరుకొనును

'పరాభక్తి' - ప్రవృత్తి భేదముచే భక్తి తామస, రాజస, సాత్త్విక గుణముల నాశ్రయించి మువ్విధములు తామసభక్తి నుండి రాజసభక్తియు అందుండి సాత్త్విక భక్తియు, ప్రభవించును. సాత్త్విక భక్తియే తురీయావస్థలో పరాభక్తిగా పరిణమించును పరాభక్తి మోక్షదాయకము.

సాత్త్విక భక్తిలో ప్రస్థానించు సాధకుడు క్రమముగా పరమప్రేమ రూపమగు పరాభక్తిలోనికి పరిణతి జెందును పరభక్తిలో శ్రవణ, కీర్తనములతో నిరంతర తైలధారారూపమున అవిచ్ఛిన్న మగు భక్తిభావముతో సాధకుడు తన ఆరాధ్య దైవమందే లగ్నచిత్తు డగును. పూజా విధివిధానములు, కర్మకలాపములన్నియు పరాభక్తిదశను చేరుకొనుటకు సాధనములు పరాభక్తిని గూర్చి దేవీభాగవతము వివరించుచున్నది

'అధునాతు పరాంభక్తిం
ప్రోచ్యమానాం నిబోధమే।
మద్గుణ శ్రవణం నిత్యం
మమ నామాను కీర్తనమ్॥

కల్యాణ గుణ రత్నానా
మాకరాయాం మయి స్థిరమ్।
చేతసోవర్తనం చైవ
తైలధారాసమం సదా॥'

అద్వైత భక్తి భావనము-జ్ఞానసిద్ధి - భక్తిలో ప్రాథమిక దశలో పూజ్య పూజక, సేవ్య సేవక భావము లుండును. పరాభక్తి యట్లుకాక, ఆత్మతత్త్వమును తెలియజెప్పును తాను వే అను భావము విస్మృతమై భగవానునితో అభేదమును భావించును 'అద్వైత' మనగా నిదియే. ఈ అద్వైత సిద్ధాంతమునకు ఆచార్య శ్రీ శంకరు లాద్యులు [15] భారతీయాధ్యాత్మిక తత్త్వమంతయు నీయద్వైతము ననుసరించియే యున్నది అద్వైతములో సంగమించు భక్తిభావమే భాగవతమునకు ప్రాణాధారము భగవద్గీత 'అద్వైతామృత వర్షిణి

ఈ అద్వైత భావనకే జ్ఞాన మనిపేరు. ఇట్టి జ్ఞానసిద్ధి సాధన తొలి దశలో సాధ్యపడదు. సాధనదశలోని భేదభావ మంతరించి, సిద్ధావస్థలో సర్వాంతిర్యామిని ఆత్మానుసంధానము గావించుకొను స్థితికి భక్తుడు చేరినపుడే అద్వైత భావ సంసిద్ధి భక్తుని హృదయమున 'నీవే నే' నను భావ మెట్లు ప్రతిష్ఠిత మగునో అధ్యాత్మ రామాయణము తెల్పుచున్నది. [16]

భక్తివైరాగ్యముల సంపూర్ణసిద్ధి జ్ఞానోదయము వలన మాత్రమే కలుగుచున్నది భక్తి వైరాగ్యముల పరాకాష్ఠ స్థితిగా జ్ఞానమును పరిగణింప దగును.

'భక్తేస్తు యా పరా కాష్ఠా
సైవ జ్ఞానం ప్రకీర్తితం।
వైరాగ్యస్య చ సీమా సా
జ్ఞానే తదుభయం యతః'

అని దేవీ భాగవతము సప్రమాణముగ వివరించు చున్నది పరాభక్తిలో సాధకుడు పరమప్రేమ పూర్వకముగ దైవమునే చింతించి, చివరకు 'ఆ చిదానంద స్వరూపము నేనే' అను అభిన్న జ్ఞానమును పొందును [17].

'పరాను రక్త్యా మా మేవ
చిన్తయేత్ యో హ్యతన్ద్రితః।
స్వాభేదే నైవ మాం నిత్యం
జానాతి న విభేదతః॥'

వేదాంత శాస్త్ర మిట్టి అద్వైతానుభూతి నే అపరోక్షానుభూతిగా పేర్కొనుచున్నది. అది 'ప్రేమభక్తి' లేక 'పరాభక్తి' యొక్క పరిణామ రూపమే

ఈ విధముగా పురాణములు సగుణారాధనను వివరించుచు, సగుణమే పరమావధి యని అంకుండి నిర్గుణోపాసనకు చేరుకొనవలయు నని సూచించుచున్నవి. నిర్గుణభక్తియొక్క ఉత్కృష్టతను వివరించుచున్నవి నిర్గుణస్థితిని జేరుటకు కావలసిన అర్చావిధివిధానమును నిరూపించుచున్నవి జ్ఞానప్రాశస్త్యమును శైవభక్తి మార్గము నిరూపించుచుండగా, మనో నైర్మల్యము, మానవ సేవ ఆవశ్యకములని వైష్ణవభక్తిమార్గము పేర్కొనుచున్నది శాక్తేయారాధనకు సంబంధించిన పరాభక్తిని, అద్వైత భావసిద్ధిని పురాణములు ప్రవచించుచున్నవి

జన సామాన్యమున కందుబాటులో నుండు రీతిలో భక్తిజ్ఞానములు కథారూపమున సంతరింపబడి, మానవునిలో భక్తిభావమును ప్రేరేచుటకు చక్కని సాధనమైనది మన పురాణ వాఙ్మయము.

---

5 శతపథ బ్రాహ్మణము 14-1-2-11,
తైత్తిరీయ బ్రాహ్మణము 1-1-3-5
తైత్తిరీయ సంహిత. 7-1-5-1,

6. 'ఇంద్రస్య యుజ్యః సఖా'- ఋగ్వేదము 1-2-219

7. 'సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా-' నారదభక్తి సూత్రములు 1.2.
'సా పరానురక్తి రీశ్వరే'- శాండిల్య భక్తి సూత్రములు 1 2

8. 'యా తే రుద్ర శివా తనూ రఘోరా పాప కాశినీ।
తయాన స్తనువా శంతమయా గిరిశం తాభి చాకశీహి॥'
- యజుర్వేదము 16-2

9 'ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుర్య ఇమాంల్లోకానీశత ఈశనీభిః।
ప్రత్యఙ్ జనాం స్తిష్ఠతి సంచుకోచాన్త కాలే సంసృజ్య విశ్వా
భువనాని గోపాః॥'
- శ్వేతాశ్వతరోపనిషత్తు. 3-2

10 ఋగ్వేద దేవీ సూక్తము 10 135

11 తామగ్ని వర్ణాం తపసా జ్వలన్తీం
వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।
దుర్గాం దేవీం శరణ మహాం ప్రపద్యే
సుతరసి తరసే నమః।
తైత్తిరీయారణ్యకము -10 1,

12 ఋగ్వేదము 10 125-5

13. 'సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వ పాపేభ్యో
మోక్ష యిష్యామి మాశుచ॥'
-భగవద్గీత- 18-66.

14 'సర్వ భూతస్థమాత్మానం
సర్వ భూతాని చాత్మని।
ఈక్షతే యోగ యుక్తాత్మా
సర్వత్ర సమ దర్శనః॥'
-భగవద్గీత-6-29

15 అద్వైతభావనలోఆచార్యశ్రీశంకరు లగ్రగణ్యులు వారు తమ 'షట్పదీ స్తోత్రము' లో భగవానున కిట్లు విన్నవించిరి

సత్యపి భేదాపగమే! నాథ!
తవైవాహం న మామకీన స్త్వం।
సాముద్రో హి తరంగః
క్వచన న సముద్రోపి తారంగః॥'

(తరువాయి 17 వ పేజీలో)

# గ్రంథ సమాలోచన

## శ్రీ రామ కథా సామ్రాజ్యము

### శ్రీరామ కథా సాహిత్య సమీక్ష

(గ్రంథకర్త ఆర్షకవి శిరోమణి, విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ 'క్రౌను సైజు 204+8 పుటలు వెల రు 10 ప్రతులు దొరకుచోటు శ్రీ బులుసు వేంకటేశ్వరులు ఎం ఏ, 8-22-14 గాంధీనగర్, కాకినాడ 533004 )

ఇది శ్రీరామునకు అంకితము దీని ముద్రణకు శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారు ఐదువేలరూప్యముల నొసంగిరి ఇందు కవిత్రయము మొదలు నేటి వరకు గల కవులు పద్యములలో గద్యములలో పాటలలో ద్విపదలలో శతకములలో నాటకములలో విమర్శలలో ప్రతి విమర్శలలో ఎవరెవరేయే విషయముల నేవిధముగ రామ కథను గైకొని రచించిరో తెలుపబడినది ఆయా కవుల కృతులలోని పద్యరత్నము లేరి పాఠకులు కంఠస్థము చేసికొనుట కనుకూలముగా నెల్లెడల ఉదాహరింపబడినవి

కవిత్రయము రామకథ, భాస్కర రామాయణము రామకథ, తిక్కన రామకథ, ఎఱ్ఱయ రామకథ, పోతనరామకథ, సింగన రామకథ, మొల్ల రామకథ, దశావతార చరిత్ర రామకథ, సీతా రామాంజనేయ సంవాదము రామకథ, అధ్యాత్మరామాయణము రామకథ గోపీనాథ రామాయణము రామకథ, పద్మపురాణము రామకథ, బ్రహ్మవైవర్త పురాణము రామకథ మున్నగు నిరువది విభాగములలో రామకథల సమీక్ష జరిగినది.

రచన సులభ సుందర గ్రాంథిక వచనమున జరిగినది గ్రాంథికవచనరచనకే కఱవైన ఈ కాలములో ఈ పుస్తకము చూచుటకు, చదువుటకు, బహూకరించుటకు అందమై ఆనంద ప్రదమై, విరాజిల్లుట విశేషము చక్కని కేలికో బైండు శ్రీరాముని పట్టాభిషేక పటము మింగు చేర్పబడినది

శైలీరమ్యతకు కథలవిశేషమునకు, ఉత్తమగ్రాంథిక రచనకు, పేరెన్నికగన్న యిట్టి గ్రంథము విశ్వ విద్యాలయ పాఠ్యగ్రంథమైన విద్యార్థులకు మిక్కిలి మేలు చేకూరగలదు శ్రమపడి విషయములు సేకరించి చక్కగ ప్రకటించిన గ్రంథకర్త ఆర్థికసాహాయ్య మొనర్చిన దేవస్థానము వారు అభినందనీయులు.

—*—

## Lives of Ancient Indian Saints Volume one·

ప్రాచీన భారతవర్ష మహర్షుల చరిత్ర తొలి సంపుటము ఆంగ్ల వచనము గ్రంథకర్త ఆర్షకవి శిరోమణి విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ, $\frac{1}{8}$ క్రౌను సైజు 165+16+4 పుటలు వెల రు 10 ప్రతులకు బులుసు వేంకటేశ్వరులు ఎం ఏ, 8-22-14 గాంధీనగర్ కాకినాడ 533004 )

ఆంధ్రమున శ్రీమద్రామాయణ భారత భాగవతాదిశతాధికమహాగ్రంథకర్తగా పేరెన్నికగన్న శ్రీ బులుసు వేంకటేశ్వరుల మహాగ్రంథములలో మిక్కిలి వ్యాప్తిగన్నది. వారి వచన గ్రంథము మహర్షుల చరిత్రలు ఎనిమిది భాగములు ప్రాచీన భారతమహర్షివాణిని మన కందించిన పుణ్యపురుషులువారు. తెలుగున వీరి యీ వచన గ్రంథము ఆబాలగోపాలము ఆదరపాత్రమై శ్రీకామకోటి పీఠాధిపతి మొదలు సామాన్య సన్యాసి దాకా అందరి మెప్పులను అందుకొన్నది. శ్రీ వేంకటేశ్వరులాంగ్ల భాషోపన్యాసకులుగా రెండుమూడు దశాబ్దులనుండి ప్రసిద్ధులు వారిపుడు మహర్షుల చరిత్రలను సులభసుందర ఆంగ్లవచనమున విరచించుట మిక్కిలి ప్రశంసనీయము.

మనమహర్షులు దేశకాలాద్యతీతులు కాన వారి చరిత్రలు కాలమునకు కాల విభాగమునకు అందనివి కనుక అకార క్రమమును పాటించి పండ్రెండుగురి చరిత్రలు ఈ తొలి సంపుటమున వీరు మన కందించిరి ఆ పండ్రెండుగురు మహర్షులు వీరు అగస్త్యుడు, అంగిరుడు, అరుణి, అష్టావక్రుడు, అత్రి, ఆరణ్యకుడు, ఆస్తీకుడు, బకదాల్భ్యుడు, భరద్వాజుడు, భృగువు, బృహస్పతి, చ్యవనుడు ఆయా ఋషుల చరిత్ర లనేక పురాణములనుండి వెలికిదీసి సమన్వయపఱచి, చక్కని మృదుసులభ శైలిలో మనపితామహుల చరిత్రలు మనకు తెలిపి వీరు మనకు మహోపకారము చేసిరి

దేశమున ఆంగ్లమానసపుత్రుల సంఖ్య అధికమై ఆంధ్రులకే ఆంధ్రము రాని దుస్థితి యేర్పడినది వారర్థము చేసికొనగల భాష ఆంగ్ల మొక్కటే అందుచే ఆంగ్లమున జదివి మన ఆర్ష సంస్కృతి నర్థము చేసికొని బాగుపడుట కిది మన వారి కెంతయు నుపకరించును వీరిట్లే అన్ని భాగములను ఆంగ్లమున వ్రాసి ప్రకటించి ఆంధ్రేతరులకు, ఆంగ్ల భాషాభిమానులకు ఉపకరింతురని ఆశించుచున్నాము - శ్రీగౌతమ

## సాయితత్వం

(రచన శ్రీ గుడిపాటి శ్రీహరి కృష్ణ, త్యాగరాజ నగర్, రాజమండ్రి 533101 డెమ్మీ పుటలు 24. వెల రు 3.00)

ఇందు షిర్డీసాయిబాబా అతిసంగ్రహ జీవిత వృత్తాంతము వారి ఉపదేశములు, షెనాయ్ నగరులో సాయిబాబా మందిర స్థాపనాది విషయములు, వారి మహిమకు సంబంధించిన విశేషములు కొన్ని తెలుపబడినవి. సాయిబాబా శిష్యులు పరమ భక్తులునైన స్వామి కేశవయ్యా జీని గురించియు వివరములు కొన్ని గలవు. సామాన్య జనులు పాటింప వీలయిన సత్ప్రవర్తన నియమములు సులభ భక్తిమార్గములు సూచింపబడినవి.

సుప్రసిద్ధ పాత్రికేయులైన శ్రీ హరి కృష్ణ గారి శైలి కడు రమ్యముగా సరళముగా నున్నది. ఎడనెడ గానవచ్చు ముద్రణదోషములు, "సంస్కృతీ సాంప్రదాయాలు" "అమృత జల్లులు" వంటివి, శైలీరమ్యతకు, వచన రచనా ధారాళతకు, బాధకములుగా గోచరింపవు.

స్వామి కేశవయ్యాజీ ప్రసక్తిలో వచ్చిన మంత్రాలయ రాఘవేంద్ర స్వామికి, శ్రీ పుట్టపర్తి సాయిబాబాకు, సంబంధించిన, పరిచయ లేశమును ఇందు కానబడక పాఠకుడు కొంచెము సందేహ గ్రస్తుడగుట కవకాశమున్నది. ఆస్తిక భావము గలవారెల్లరు పఠించి మేలొందదగిన గ్రంథ మని చెప్పవచ్చును.

- శ్రీ గౌతమ.

## కాలము!

శ్రీరామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం.ఏ.

*ఆది యనాది, అనంత మవ్యయము సతము
జనుల తనచుట్టు త్రిప్పుకో జాలినట్టి
వింతరంగుల రాట్నమ్ము, వెండితెరజ
గమ్మునెడి రంగభూమికి కాల మెగద'

* కాలమే కొందరికి గుండె గాలమౌను
ఇదియె కొందరి కద్భుత హేల యగును
విలసదానంద డోలయై వెలయుఁ గొంద
అకుఁ గలఁడె యింత యైంద్రజాలికుఁడు
భువిని

* ఏటి కెదురీదగా వచ్చు పాటవమున
అల్లజాబిల్లి లోఁ జెవుల్ పిల్లి చెవుల
పట్టి యాడింపవచ్చుఁ గాల్మెట్టి కాని
కాలము నెదిర్చి నిల్వగాఁ గలఁడె నరుడు

* అవని జనులకు జీవనయానమందుఁ
గ్రొత్తబంధమ్ము లను చివుళ్ళెత్తఁ జేయు
గట్టియను బంధముల దవ్వు నెట్టి వేయుఁ
గాలము నుమించిన నియంత గలఁడె తలప

* కోరికలఁ దీర్చుకొనుటకు నేరుపాలయ
మిన్నగా గుప్పిటను పెట్టుకొన్న గాని
నరుని అశ్రద్ధ యను సందు దొరికినంత
చోరునింబోలె మెల్లగా జారుకొనును
కాలమును మించుటక్కరి గలఁడె ధరణి'

* గిల్లియేడ్పించి తా బుజ్జగించు పగిది
శిశువులఁ గెంచి గాయాలు చేసి యెదకు
కాలపురుషుండు దినదినాకారుఁ డగుచు
ముద్దుగా ప్రజ నోదార్చి పోవుగాదె,

* కొంపలన్ని యున్నటులంటుకొన్న గాని
అంబరం బంటినంగాని సంబరాలు
కాలచక్రాన విలసిల్లుగాదె ఒకట
తన ప్రమేయమేలేని వర్తనము జగతి॥

*కాలము రసాత్మకంబైన కథలతోడ
సెట్టుగానున్న రీళ్ళక్యాసెట్టుగాదె
మనసాక రికార్డు ప్లేయరై తనర, మనకు
స్మృతులయనుభూతి సంపదలిడుగదోయి!

## వసంతం ఉదయించాలి.

— శ్రీ [illegible] ఎల్. సుబ్బారావు

ఉదయించే సూర్యుడు
ఊరంతటికీ బంధువు.
రోజూ వాడ్ని చూస్తున్నా,
ఈరోజు వాడ్ని,
రేపు కూడా చూస్తా వనే,
ఆశతో చూడు.
ఎందు కంటే?
ఇది సంవత్సరానికి తొలి ఉదయం.
ఆశల మొక్కలు నిలిచిన మనస్సులో,
మోజుల చిగురాకులు వేస్తున్న తరుణంలో
కోరికల కిరణాలు విరజిమ్ముతూ,
శక్తి సూర్యుడు ఉదయిస్తే,
అదే, మన జీవితంలో
"వసంత - ఉదయం"
దానిలోనే వాడి అభ్యుదయం.

—·—

( 15 వ పేజీ తరువాయి )

16 అధ్యాత్మ రామాయణములో ఆంజనేయుడు

'దేహబుద్ధ్యాతు దాసోఽహం
జీవ బుద్ధ్యా త్వదంశకః।
ఆత్మ బుద్ధ్యా త్వమే వాహం
ఇతి మే నిశ్చితా మతిః॥'

అని శ్రీ రామునితో పల్కెను.

17. 'స్వాభేదేనైవేతి। అహమేవ సచ్చిదానంద రూపిణీ భగవతీ అస్మీతి భావనయా ఇత్యర్థః। - అని శైవనీలకంఠుని వివరణము.

[ఆంధ్ర విశ్వ విద్యాలయము తెలుగు శాఖలో శ్రీమతి డాక్టర్ కోలవెన్ను మలయవాసిని గారి పర్యవేక్షణలో నే జేయు 'భాగవతము - భక్తితత్త్వము' అను పరిశోధనాంశమునకు సంబంధించి వ్యాస మిది. వారికి నా నమస్సులు.]

—

# ఈ పక్షంలో

## బిరుద ప్రదాన సన్మానము

హైదరాబాదు అశోకనగరములో శ్రీసత్యనారాయణస్వామి దేవస్థానమున గల రామకృష్ణాశ్రమము యాజమాన్యమున 26-4-81 నుండి 4-5-81 వరకు శ్రీచిర్రావూరి శ్రీరామశర్మ ఎం ఏ. గారు (ఉపన్యాసకులు, గౌతమీ ఓరియంటలు కాలేజి, రాజమండ్రి) శ్రీమద్రామాయణ సుందరకాండ ప్రవచనము గావించిరి. "శ్రీరామాయణతత్త్వజ్ఞ"అను బిరుదముతోను బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకట్రామశాస్త్రిగారు రచించిన సంస్కృత పద్య నవరత్నమాలికతోను శ్రీరామశర్మగారు సన్మానింపబడిరి

'అనేక విద్యాప్రవీణ' బ్రహ్మశ్రీ చిర్రావూరి శ్రీరామ శర్మభ్యః బ్రహ్మ విద్యాలంకార బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకట రామశాస్త్రిణా భాగ్యనగర సభా ప్రతినిధినా సమర్పితా శ్రీ వాల్మీకి రామాయణ ప్రవచన ప్రశంసా పద్య నవరత్నమాలికా

శ్రీభాగ్యనగరే౽శోక
పురే గురు కృపాలయే
శ్రీపల్లెంపాటి వంశాఢ్య
వేంకటేశ ప్రతిష్ఠితే

*సత్యనారాయణ స్వామి
మందిరే భక్త సుందరే
శ్రీరామకృష్ణాశ్రమస్య
కార్యకర్తృ ప్రపాలితాం

*ఆస్థాయ శ్రీరామ శర్మా
సభాం శర్మ ప్రభావనః
బ్రహ్మశ్రీమాంశ్చిరం జీవీ
చిర్రావూర్యబ్ధి చంద్రమాః

*వాల్మీకి వాగ్వేద రూప
శ్రీరామాయణ కోవిదః
ప్రవక్తి సుందరం కాండం
సుందరం సుందరాకృతిః

* శ్రీమద్దుర్మతి చైత్రస్య
కృష్ణా మారభ్య సప్తమీం
ఆంగ్లాంధ్ర గీర్వాణ విద్యా
వేదవేదాంగ ధర్మవిత్

* అనంత పద్మనాభాఖ్య
పితృపాద ప్రభావితః
స్వకీర్త్యాస్య పితుః కీర్తి
శ్శోభతే సుతరాం తథా

* ఫల పుష్ప ప్రకాశేన
పాదపశ్శోభతే యథా
మీమాంసా న్యాయ విజ్ఞానాత్
పూర్వ వ్యాఖ్యాన శీలనాత్

* నిగూఢ వాల్మీకి పద
స్వారస్యార్థా న్మనోహరాన్
హృదయ స్పందిన శ్శంసన్
శర్మాయం శర్మదో యతః

* శ్రీ భాగ్యనగరా శోక
నగర స్థాస్సభాసదః
"శ్రీరామాయణ తత్త్వజ్ఞ"
ఇతీమం కీర్తయం త్యహో.

## భారతి

'భారతి' సాహిత్య మాస ప్రతిక 'అనివార్య కారణాలవల్ల తాత్కాలికంగా నిలిపి వేయబడుచున్నది' అనే విప్రియలు సంచికలోని తత్పత్రికాధిపతి ప్రకటన సాహిత్యప్రియులకికి నిరుత్సాహ కరమైన వార్త. రమారమి60 సంవత్సరములను సాంస్కృతిక, సాహిత్య విజ్ఞాన రచనలద్వారా భారతి ఆంధ్ర లోకమునకు గావించిన సేవ నిరుపమానము.

సమర్థులయిన రచయితలను ఆకర్షించి, ఉత్తమ శ్రేణి రచనల నెన్నిటినో పాఠకలోకమున కందించిన పత్రికా రాజము భారతి.

పరిస్థితులు చక్కబడి భారతి పునః ప్రారంభింప బడవలయునే కాని మరే విధముగను ఆస్థానము భర్తీ కాజాలదు. భారతి అచిర కాలములో పునరుద్ధరింప బడి ఆంధ్ర పత్రిక, అమృతాంజనములతో పాటు చిరకాలము వర్థిల్ల వలయు నని సమాలోచన ఆకాంక్షించుచున్నది.

- సంపాదకుడు.

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోస్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజీ,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B. V. & Co , Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.